# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. |
|---|---|---|
| అచ్చ తెలుగు రామాయణము | ... | 2 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | ... | 2 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్యుఁడు | ... | 1 |
| అనుభవసారము, పాలకురికి సోమనాథ ప్రణీతము | ... | 1 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) సటీక | ... | అ॥ |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | ... | 0 |
| ఆంధ్రమహాభారతము:— | | |
| ఆదిపర్వము, టీక (పాతది) | ... | 8 |
| ఆదిపంచకము | ... | 11 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వం | ... | 8 |
| శాంతిసప్తకము | ... | 7 |
| ఆది సభాపర్వములు | ... | 4 |
| అరణ్యపర్వము | ... | 4 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 |
| శాంతిపర్వము | ... | 4 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 |
| ఆనందరంగరాట్ఛందము | ... | అచు. |

శ్రీరస్తు

# ఇళాదేవీయము

అను నామాంతరముగల

# రాధికాసాంత్వనము

## ముద్దుపళని

శ్రీమతి విద్యాసుందరి

బెంగళూరు - నాగరత్నముచే

పరిష్కృతము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము

1960

# ప్రస్తావన

సీ. శ్రీపరిపూర్ణ మహా వ్రేపల్లెవాడలో
నందగోపాలునిమందిరమున
నవతీర్ణుఁ డై మేనయత్త యౌ రాధికా
విధుముఖిచేఁ బ్రేమఁ బెంపుఁ గనుచుఁ
దనమేనమామకూఁతు నిళాలతాంగిని
బెండ్లాడి యామెతో వేడ్కనుండఁ
దనవియోగముచేతఁ దాళఁ జాలక చాలఁ
జింతిల్లుచుండుటఁ జిల్కవలన

తే. విని మిథిలనుండి యింటికి వేగ వచ్చి
చతురగతులను రాధికాసాంత్వనమ్ముఁ
జేసి దక్షిణనేత నా వాసిఁ గన్న
చిన్నికృష్ణుని మనసులో నెన్నుచుందు.

నేను చిన్ననాఁటనుండియు సంగీతవిద్యతోపాటుగా హిత్యవిద్యయందుఁగూడఁ గొంచెము గొప్పపరిశ్రమచేయుచు దేశభాష యగు కన్నడములోను దెలుఁగులోను బెక్కు థములు చదివితిని. తరువాత బెంగుళూరినుండి యీ చెన్న మునకు వచ్చినది మొదలుగా నరవములోఁ గూడ ననేక ములఁ జదువుచుంటిని. అయినను నాకాంధ్రభాషాగ్రంథ యందుఁ గలయభిరుచి పైభాషలలో నంతగా లేకపోయినది

ఇట్లుండఁగా "పేలాంవెజ్జీ" అనుసామెతఁగాఁ జనపదములనుండి తెలుఁగుబాసలోఁ గవిత్వము చెప్పవలయు నను కుతూహలము కూడఁ గలిగి పట్టుదలతో సకల భారతాంగ నాంధ్రగ్రంథములు చదివితిని. ఇప్పుడే బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతి వేంకటేశ్వరకవులు రచించిన శ్రవణానందము మొదలగు గ్రంథములు చదువుచుండఁగ వారి "పాణిగృహీత" యను ప్రబంధములోని

తే. రాధికాసాంత్వనమ్మును రచనఁ జేసి
పేరు గనుముద్దుపళని తెల్విఁగను విజయ
నగరభూపాలుఁ డుంచినట్టిచాటు
పద్యములు గాంచి యాకీర్తి పడయ నెంచి.

అను పద్యమును జూచి రాధికాసాంత్వనమును గడుఁగుతూహలముతోఁ గొని చదువఁగా నందు ముద్రాపమయములఁ దటస్థించిన తప్పు లెన్నియో కన్పట్టినవి. అయ్యయో! ఇయ్యది మంచి ప్రతి దొరకకపోయినదే యని విచారించుచుండఁగా దైవవశమ్మున నామిత్రు లొకరు చాలకాలముక్రిందట వ్రాసిన వ్యాఖ్యానసహితమైనయొక వ్రాఁతప్రతిని నాకుఁ బంపించిరి. అదియు నచ్చుప్రతియు సరి చూడఁగాఁ జాలవ్యత్యాసము గనుపించినది. మంగళాచరణము మొదలు షష్ఠ్యంతములవఱకును గల పీఠిక లేకపోవుటయే కాక మధ్యమధ్యను గొన్ని పద్యములుకూడ లేవు. మఱికొన్నిచోట్ల పద్యములచరణములే విడువఁబడియున్నవి. ఇట్టిముద్దులమూటగట్టు రాధికాసాంత్వనమును రచించినది

## ముద్దుపళని.

ఈమెను గూర్చి మ॥ రా॥ శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారు తమయాంధ్రకవుల చరిత్రములో వ్రాసినవాక్యములు కొన్ని యవసరముంబట్టి యిం దుదాహరించుచున్నాను. "ముద్దుపళని పద్యకావ్యములు చేసిన స్త్రీలలో నొకతె. ఈముద్దుపళని వేశ్యాంగన. ఇది రాధికాసాంత్వన మను నాలుగాశ్వాసములశృంగార ప్రబంధమును రచించెను. దీనితల్లి పేరు ముత్యాలు. ఇది తంజావూరు సంస్థాన ప్రభు వగు ప్రతాపసింహుని యుంపుడుకత్తె యైయుండవచ్చును... గ్రంథములో వ్రాయంబడినదానిని బట్టి యూహింపవలసి యున్నది. దీనికే ఇళాదేవీయ మను నామాంతరము గలదు" అని యున్నది. ఇందు "తల్లి పేరు ముత్యాలనియు, గ్రంథములో వ్రాయంబడినదానినిబట్టి యూహింపవలసి యున్నది" అనియును వ్రాయుటచే శ్రీపంతులవారు కూడఁ బీఠికను జూచినట్టు గన్పట్టదు. పీఠికలోఁ గవయిత్రి వంశవర్ణనము గలదు. ముత్యాలనునామె పళనికిఁ దల్లి. "ముద్దు" అనునది యుపనామము. పళని యనఁగా దక్షిణదేశములోని సుబ్రహ్మణ్యస్వామి వెంచేసియున్న దివ్యస్థలమునకుఁ బేరు. చాలచోట్ల బిడ్డలకు దేవస్థలముల పేరులే యుంచుచుండుట వాడుక యున్నది. ఈప్రబంధములో యశోద తన మేనగోడలును శ్రీకృష్ణునికి భార్యయగునట్లు చేసినచరిత్ర ముండుటచే దీనికి ఇళాదేవీయ మను నామాంతరము వచ్చినది.

"ఇది సంగీతసాహిత్యభరతశాస్త్రములలోఁ బ్రవీణురాలైనట్లు తానే చెప్పుకొన్నది. దీని కవిత్వము నాతికఠినమై మృదువుగా నుండినందుకు సందేహము లేదు. దీనికి మంచి సంస్కృతాంధ్ర

సాహిత్యమును గలదు. అందందుఁ దప్పు లున్నవి కాని యట్టి తప్పులు పురుషులకవిత్వమునందు సయిత మనేకగ్రంథములలోఁ గానంబడుచున్నవి" అని శ్రీపంతులవారే యొప్పుకొనిరి. బాగుగా నాలోచించినచో శబ్దమునుబట్టియో అర్థమునుబట్టియో భావములనుబట్టియో రసమునుబట్టియో ఔచితిని బట్టియో యెటు లయిననేమి తప్పులేకుండ భారతము మొదలుగా నేగ్రంథమును లేదు. ఇట్లుండఁగా స్త్రీలు వ్రాసినగ్రంథములలోఁ దప్పు లుండుట యొకతప్పు కాదు. "అయినను గ్రంథములోనిభాగము లనేకములు స్త్రీలు వినఁదగినవియు, స్త్రీనోటినుండి రాఁదగినవియుఁ గాక దూష్యములై యున్నవి" అని శ్రీపంతులవారు వ్రాసిరే కాని తారాశశాంకవిజయము, హంసవింశతి, వైజయంతీవిలాసము మొదలగు గ్రంథములలోనివానికన్న నెక్కువగా నిందు దూష్యము లున్నవా? అదిగాక స్త్రీలు పురుషులవలన వినఁగూడక పోవచ్చునుగాని తమలోఁ దాము చదువుకొనుటకు బాధక మే మున్నది? ఇంతకును నిది భగవచ్చరిత్రము, తారాశశాంకవిజయాదులవలె స్త్రీలకుఁ జెడుబుద్ధులు గఱపువిషయ మేదియును నిందు లేదే. "ఇది జారత్వమే కులవృత్తిగాఁ గల వేశ్య యగుటచే స్త్రీజనస్వాభావిక మైనసిగ్గును విడిచి శృంగారరస మనుపేర సంభోగాదివర్ణనములను బుస్తకమునిండ మిక్కిలి పచ్చిగాఁ జేసినది" అని వ్రాసిరి. అగ్నిసాక్షికముగా నొకమగనిం గట్టుకొని రెండవమగనితోఁ బోవుట జారత్వ మనిపించుకొనును గాని వేశ్య జారిణి యనిపించుకోదు. బ్రహ్మసృష్టినాఁటినుండియు వచ్చుచున్న మాజాతికిఁ గులవృత్తి యెట్టిదో ఆసంగతియంతయు

వాత్స్యాయనకామసూత్రములఁ జూచువారికి యథార్థము గోచరించును.

సిగ్గనునది స్త్రీజనమునకే కాని పురుషులకుమాత్రము స్వాభావికము కాదు కాఁబోలును. ఇక్కవయిత్రి వేశ్యగనుక సిగ్గుమాలి సంభోగాదివర్ణనములు పచ్చిగా వ్రాసిన వ్రాయవచ్చును. కాని శిష్టు లనిపించుకొన్న పురుషు లట్లు వ్రాయఁగూడదుగద? అట్టి మహానుభావులుమాత్రము తమతమగ్రంథములలో నింతకన్న నెక్కువపచ్చిగా వర్ణనలు చేయలేదుకాఁబోలును. వేయేల? శ్రీపంతులువారే తమకవులచరిత్రలో "వేశ్యాసంపర్కమువలన నెట్టిదృఢమనస్కులకును ననర్థములు వచ్చునని చూపుటకయి యింతవఱకుఁ గల్పింపఁబడినకథ నీతిబోధకముగానే యున్నది కాని తరువాతికథమాత్రము నీతిబాహ్యముగా నున్నది" అనియు, "ఇటువంటి సిద్ధాంతములే మనదేశములో నీతికిని మతమునకును గూడ నమితమైనచెఱుపును గలుగఁజేయుచున్నవి. నీతిని విడిచినమత మెప్పుడును దేవునికిఁ బ్రీతికరము కానేరదు" అనియు నిందించి తరువాతఁ దమస్వహస్తముతో సరిచూచి యచ్చొత్తింప నిచ్చిన వైజయంతీవిలాసములోని పచ్చివిల్తుని పచ్చికపట్టుకన్నను, వీరే స్వయముగ రచించిన * రసికజనమనోరంజనములోని బూతులకన్నను నిందుఁ బచ్చిబూతులు కన్పట్టుచున్నవా?

ఈగ్రంథము రస మొల్కుచుండుటచేతను, ఇది రచించినది స్త్రీయేగాక మాజాతిలోఁబుట్టిన దగుటచేతను దీనిని

---

* వీ రధికారమం దుండుటచే మదరాసు విశ్వవిద్యాలయములో దీనిని వీరు పఠనీయగ్రంథముగా నిర్ణయించుకొనిరి.

మంచిప్రతిగా ముద్రింపవలయు నను తలంపుతో వ్రాఁతప్రతిని ముద్రితపుస్తకమును సరిచూచి నామనసున కింపైనపాఠము నుంచి యొకప్రతి చక్కఁగా వ్రాసితిని. ఇటీవల బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారు ప్రాచీనప్రబంధములను మంచిస్థితిలోనికిఁ దెచ్చుచుండుటచే దీనినిగూడ వారే యచ్చొత్తించినచోఁ జాల బాగుగ నుండు నని యెంచి యీప్రతి యనేక వందనములతో వారియొద్దకుఁ బంపించితిని. ఇది వ్రాసినదియు సవరించినదియు స్త్రీయే యగుటచేత నుగలిగినతప్పుల నొప్పులుగా గమనింతు రని స్త్రీలయందు గౌరవము గలవారిని బ్రార్థించుచున్నాను.

సౌమ్యసంవత్సరపు<br>
మహాశివరాత్రి.<br>
చెన్నపట్టణము 9-3-1910

ఇట్లు,<br>
సహృదయవిధేయురాలు,<br>
బెంగుళూరు-నాగరత్నము.

శ్రీరస్తు

# రాధికాసాంత్వనము

---

## పీఠిక

ఉ. శ్రీలఁ దెలుంగు రాధికకుఁ జెల్వగు నిన్నిల రూపరేఖలన్
బోలుచు రేపడంటుబు లస మోహపుటాలిని నిప్పుడెన్నడో
వాళిని నన్నుఁ జూచ్చి యని నర్గిన యచ్చెలిఁ గౌఁగిలించుగో
పాలునిఁ జిన్నికృష్ణునిఁ గృపాళునిఁ గొల్తు సభీష్టసిద్ధికై. 1

సీ. రహి ముద్దుటొసఁగులు రాజీవములఁ గేరఁ
బ్రసదముల్ తాఁబేటివగలఁ బోర
సరసోరుకాండముల్ సౌకర్య మేపార
లేఁగౌను సింగంపులీలఁ జీరఁ
జనునళుల్ త్రిక్రమీసౌజన్యమునఁ దేలి
భుజము లారాశసౌస్ఫూర్తి మీఱ
రమణీయముఖకాంతి హిమచంద్రునిఁ జేరఁ
జిరునవ్వు బలుతెల్వగలిమిఁ గోరఁ

తే. గన్నుఁగవ శ్రుతిలంఘియై కలిమిఁ గులుకఁ
దనరుమధురాధరము కన్నెకేసనము చిల్కఁ
తెలుఁగుశుకవాణి రుక్మిణీజలజపాణి
భావభవుమాత సంపద లీవుఁగాత. 2

చ. నెఱిగమనంబు వేణియును నిక్కుచనుంగవ మీఁదిపాదముల్
కరులును శేషభోగియు నగంబులు నాదిమకూర్మరాజ మై
వఱలఁగఁ బొల్చుగంధవతిభామ మనోహరరూపసత్వతన్
నరకునిగాంచి నెంచుగతి నన్ గృపనెప్పుడుఁ బ్రోచుఁగావుతన్.

ఆ. శ్రీనివాసుఁ డైన శేషుని భజియించి
ఘనశరీరుఁ డైనగరుడిఁ బొగడి
యఘువిదారి యైనహరిచమూపతి నెంచి
పరమసూరిజనులఁ బ్రస్తుతింతు. 4

మ. తలఁతి వాల్మీకిపరాశరప్రియసుతశ్రీకాళిదాసాదిసం
స్కృతవిద్వత్కవితాజ్ఞులం బొగడి భక్తిన్ నన్నయార్యుండున
న్నతియాతిక్కనసోమభాస్కరులు శ్రీనాథుండుభీముండునాఁ
గృతు లానాంధ్రకవీంద్రులం దలఁతు యుక్తిన్ మత్కృతి
ప్రౌఢికిన్. 5

తే. పొత్తమున నుండుశల్యంబు లెత్తి వైచి
శాస్త్రయుక్తిని గొని భేషజంబు సేయఁ
గఁ దగునాక్షేపజీవకకవులఁ దీర్పఁ
జనదు కృతుల నమంగళజనులు వారు. 6

చ. చెలువుగఁ బూర్వసత్కవులు చేసినకబ్బము లెన్నొ యుం
డఁగాఁ, జెలిమిని నీకృతిన్ గణన సేతురె సత్కవు లందు
రేమొకో, భళి కయికొందు రె ట్లనినఁ బద్మపుఁ దేనియ నాను
తుమ్మెదల్, పులిసి హాసించకే యితరపుష్పమరందము లోలిఁ
గ్రోలవే. 7

వ. అని యిష్టదేవతానమస్కారంబును, గవిసత్కారంబును,
కుకవితిరస్కారంబునుం గావించి యొద్దియేనియు నొక్క

శృంగారప్రబంధంబు నిబంధింపం దలంచి హరివాసరంబున శ్రీహరిం బ్రార్థించి మన్నిశాంతంబున నిదురింపుచున్న నన్నిశాంతంబున. ౮

కటిఁ జొట్టికట్టినకనకాంబరముతోడ
మెఱుఁగుచామనిచాయ మేనితోడ
నాసికతుదఁ గల్గునవమౌక్తికముతోడ
జిగిలికస్తురిబొట్టు మొగముతోడఁ
గరుణారసముఁ జిల్కు కన్నుఁదమ్ములతోడ
నెమ్మిరెక్కతురాయినీటుతోడ
గుదిగొని వెన్నాడు కుసుమపుంజముతోడఁ
జంద్రసూర్యాదిభూషాళితోడఁ
బ్రతి యెఱుంగని దివ్యరూపంబుతోడ
సొగసు గనుపించు మవ్వంపు సొంపుతోడ
రాధికామణికై దండపముఁ బూని
చిన్నికృష్ణుండు కలను బ్రసన్నుఁ డయ్యె. ౯

ఇట్లు గనుపట్టునతని నే నెలమిఁ గాంచి
లేచి సాష్టాంగవందనం బాచరింప
శౌరి ననుఁ జూచి మేఘగంభీరరవము
దనరఁగాఁ బల్కెఁ గరుణామృతంబు లొల్క. 10

చిన్నికృష్ణుండ నే నాదుచిత్తమునకు
సమ్మతం బైనరాధికాసాంత్వనంబు
తగ నొనర్పు మదీయాంకితముగ నీవు
లలితగుణపేటి శ్రీముద్దుపళనిబోటి. 11

వ. అని యానతిచ్చి యంతర్ధానుం డగుటయు నేను నిదుర మేల్కాంచి యీశుభస్వప్నం బెవ్వరితోడ విన్నవించెద నని యూహించి యుభయవేదాంతప్రతిష్ఠాపనాచార్యుం డును, నిరుపమౌదార్యగాంభీర్యధుర్యుండును, పాషండ షండగిరిఖండనమహాఖండలుండును, శాలీనభక్తమండ లుండును, తిరుమలతాతాచార్యవర్యకులకలశపాథోవార తారాధారుండును, మదీయపూర్వజన్మతపఃఫలసారుండును, సుగుణాభిరాముండును నగు వీరరాఘవదేశికసార్వభౌముని సన్నిధానంబున కరిగి సాష్టాంగవందనప్రణామంబు లాచ రించి తత్కటాక్షంబునుం గాంచి యీశుభస్వప్నంబు విన్న వించినం దత్సన్నిధానంబునం గల సకలకళావల్లభు లగు విద్వజ్జనంబులు నన్నవలోకించి సాక్షాచ్ఛ్రీమన్నారాయణా పరావతారుండగు వీరరాఘవసుధీమచ్చరణారవిందంబు లాశ్ర యించినదాన వగుటం జేసి దేవదేవుం డగు శ్రీకృష్ణదేవుండు సాక్షాత్కరించె దీన నీకు నధికశ్రేయఃప్రాప్తి యగు నదియునుం గాక. 12

సీ. ఏరాజు కువలయం బెల్ల రంజిలఁ జేసి
జైవాతృకాఖ్య నిచ్చలుఁ దలిర్చు
నేలోకబాంధవుం డిలఁ దమంబు లడంచి
చక్రప్రమోదంబు సంఘటించు
నేఘనుండు శరంబు లేవేళఁ గురియించి
పరవాహినుల నెల్ల భంగపఱచు
నేయాశుఁ డార్యావనాయత్తమతిఁ గాంచి
కీర్తింప సర్వజ్ఞమూర్తి యౌను

తే. వాఁడు నృపమాత్రుఁడే రఘూద్వహానయప్ర
వాహవర్ధితభోసలాన్వయపయోధి
సోమతోళజేంద్రసత్తనూజుండు శ్రీప్ర
తాపసింహక్ష్మాపాలతల్లజుండు. 13

సీ. తనయారత్నసుతనుపహారాదార్యవిస్ఫురణంబు
లేఖద్రుఁ బండ్లిగిలింపఁ జేయఁ
దనరామభక్తిప్రధానమానసశుద్ధి
నారదుఁ వెలవెలఁ బాఱఁ జేయఁ
దనసర్వవిద్యావధానమేధాస్ఫూర్తి
పన్నగేంద్రుని తలల్ వంపఁ జేయఁ
దనయఖేదగ్రగభీరతానారతఖ్యాతి
యంబోధి భంగపాటొందఁ జేయ

తే. సమర శీతాద్రిసేతుమధ్యావనీత
లాంతరనిరంతరయశోవిలాసభాస
మానభోసలతోళజరాణ్మణిసుతప్ర
తాపసింహేంద్రమౌళి ప్రతాపహేళి. 14

తే. ఆమహారాజుకృపఁ జెందినట్టిసీకు
నిట్టిభాగ్యంబు లద్భుతం బేమి తెల్ప
సార మగు నీదువిస్తారచర్య లెల్ల
వినుము వినుపింతు మని యిట్టు లనిరి కరుణ. 15

సీ. శ్రీరమణీకుచశిఖరాగ్రములు సేవి
చిగురుజొంపంబు లై జిగి చెలంగు
స్మరరిపుబ్రహ్మాదిమకుటంబులం దేవి
పద్మరాగంబు లై ప్రభ లొసంగు

మహానిరాజ్ఞానసమానసంబుల నేవి
కమలవనంబు లై ఘన మెసంగుఁ
జితతరశ్రుతివధూసీమంతముల నేవి
యరిదికుంకుమపట్టు లై వెలుంగు
తే. నట్టిసర్వజ్ఞమౌళిశృంగాగ్రనటన
పటుతరక్రమత్రిజగతీపావనప్ర
తీతచారిత్రసురధునీతిలకజన్మ
పదము లనుపమశ్రీవిష్ణుపదము లమరు. 16
తే. ఆమహీనాథుపదపద్మమందుఁ బుట్టి
సురుచిరఖ్యాతిఁ గనె నీతి శూద్రజాతి
దాన నయ్యార్యవయు సెలంగెదానకర్ణుఁ
డితఁడె యం చని జను లెన్నఁ జతురుఁ డగుచు. 17
తే. ఆతఁ డెంతయుఁ గాంచెఁ జెంగాటివలన
నతుల యగు ముద్దుతంజనాయకిని బ్రేమ
నాడి బొంకనివాని ముత్యాలుఘనుని
తంజనాయకి వారలఁ దత్తు గొనియె. 18
క. అలతంజనాయకీమణి
కలిమియుఁ జెలిమియు గణింపఁగాఁ దర మగునే
తెలివో గెలివో వలపుల
చెలువో గెలువో దలంచుఁ జెలువముచేతన్. 19
సీ. వీణ వాయించెనా వివిధచిత్రాద్భుత
ప్రతిమ లెల్లను తలల్ పఱఁగ నూఁచు
తీవి నటించెనా దేవలోకపురంధ్ర
కొంచక యాడల వంచుకొనును

గానంబు వినుపింపఁ బూనెనా? యామహా
గిరిరాజ మైనను గరఁగిపోవు
సభల మాటాడెనా చల్లఁగాఁ బన్నీరు
చిలికినరేవను జెలువు మీఱు
తే. నని దొరాదొర లెన్నఁగా ఘనత కెక్కి
ప్రోడచేడెలలో సీడు జోడు లేక
తతసుగుణపేటి దివ్యసౌందర్యవాటి
యతనుమదఘోటి తంజనాయకివధూటి. 20

క. ఆరాజవదన ప్రోవఁగ
నారీమణి ముద్దుతంజనాయకి ముత్యాల్
ధీరుఁడుఁ జెలఁగిరి కుంతియు
నారయ వసుదేవునటుల ననుకూలముగాన్. 21

క. అలముద్దుతంజనాయకి
నలు వందెను గలిమిఁ దంజనాయకి యనఁగా
వలపులదొర యైనను గని
వలపులు గొనునట్టిమేనివలపులు చెలఁగన్. 22

సీ. ఈవిచేతనె కాదు తీవిచేతను గూడ
శశిరేఖ నెంతయుఁ జక్కడంచుఁ
జూపుచేతనె కాదు రూపుచేతను గూడ
హరిణీవిలాసంబు నొఘుళించు
నోరుచేతనె కాదు సౌరుచేతను గూడఁ
దారావినోదంబు నాఱడించుఁ
దళుకుచేతనె కాదు కులుకుచేతను గూడ
హేమాతిశయమును హీన మెంచు

తే. నని కవుల్ మెచ్చఁ దనరె సోమార్యు మెచ్చు
సన్నిటను జాణ సకలవిద్యా ప్రవీణ
మేటిమరుదంతి యింతులమేలుబంతి
హారిగుణ ముద్దుతంజనాయకిమిటారి. 23

క. ఆముద్దుతంజనాయకి
ప్రేమను గొని కనియెఁ దీవె వెరఁ బడసె నన
భూమీశు లెంచఁ దగుసఖ
రామాద్భుతసుగుణమణిని రామామణినిన్. 24

సీ. ఏరామ కట్టించి యిడె నగ్రహారంబు
పుడమి రామాంబాఖ్యపుర మనంగ
నమర నేధన్య దివ్యాలయం బొనరించి
తిరము గాఁగ శివప్రతిష్ఠఁ జేసె
నెంచి యేపుణ్య పెట్టించె సంపసనసని
కొఱఁతలేనివిరు లెత్తి కోమరు మిగుల
నేమాన్య జీవనం బెసఁగఁ దటాకంబు
ఘటియించె సేతుమార్గంబునందు

తే. మేటి యెవ్వతె గండపకోటలోన
మఱియు నిత్యాన్నదానాదిమహిమ లంది
పార్వతీశులనిత్యోత్సవము లొనర్చె
నట్టిరామామణివధూటి నలవె పొగడ. 25

సీ. ముద మొప్పఁ దనగోముమోము గాంచినవాఁడె
తేజ మొందినరాజరాజు గాఁగఁ
బ్రతిలేని తనకటిప్రతిమఁ జెందినవాఁడె
తెఱఁ గొందుభూతలాధిపుఁడు గాఁగఁ

సీ. శ్రీలక్షణమున లక్ష్మిని సాటి యన వచ్చుఁ
జంచల యైన ధాత్రి మించ దేని
వైభవంబున శచీవనిత నీడన వచ్చుఁ
బలుగాకిపుత్త్రులఁ బడయ దేని
భూతిపెంపున శైలపుత్త్రి జోడన వచ్చు
విభుమేను సగము గావింప దేని
నిశ్చలక్షమ ధారుణిని సరి యన వచ్చుఁ
బతులను బెక్కండ్రఁ బడయ దేని
తే. యనఁగ ననుపమసకలగుణాభిరామ
యగుచు బాంధవజనకోటి యభినుతింప
సొంపు మీఱఁగఁ బెం పెక్కు సంపదాఢ్య
హరిగృహావాటి శ్రీపోటి యన్వధూటి. 29
సీ. సాహిత్యవిద్యావిశారద శారద
వై ముద్దుపళని నా నమరునిన్ను
గురుతరం బైన తగుగుణగణప్రౌఢివే
లాయుతుం డైన వేలాయుధాఖ్యు
భరతభావాభావభావజగురుఁడు నాఁ
గొమరుఁ జెందెడుముద్దుకొమరువరుని
రూపవిభ్రమకళారూఢి నెంతయు రతీ
దేవి యా ముద్దులక్ష్మీవధూటి
తే. బుద్ధి నల్లారుము ద్దైనముద్దయాఖ్యుఁ
దీటు లేనట్టిపద్మావతీలలామఁ
దెలివి మీఱు రామస్వామి నెలమిఁ గాంచె
మేటిముత్యాలు పోటివధూటివలన. 30

క. వెలసితివి వారిలోన
నెలచుక్కలలోనఁ జెలఁగునెలరేక యనఁగ
లలితకళావిభవంబులు
వల నొప్పఁగ మేటిముద్దుపళనివధూటీ. 31

సీ. ఏనాతి నీరీతి నెంతో భక్తి చెలంగ
వ్రాయించె జయధాటి రామకోటి
ఏనారి నీదారి నెలమి విద్వచ్ఛ్రేణిఁ
దనియించె నెద మెచ్చి ధనము లిచ్చి
ఏకల్కి నీపోల్కి నిలఁ గీర్తిఁ గైకొనెఁ
గబ్బముల్ చేనంది ఘనతఁ జెంది
ఏబాల నీలీల నిటు దొరదొరలచేఁ
బొగడొందె గడిదేఱి పొలుపు మీఱి

తే. తలఁప నేధీఁగ నీమేరఁ దాతయార్య
పాదముల వ్రాలె మది నెంచి ప్రస్తుతించి
కలరె నీసాటి ముత్యాలుకన్న మేటి
ప్రబలగుణపేటి శ్రీముద్దుపళనిబోటి. 32

సీ. చెన్నొందురంభ గాకున్నచో నుబ్రతాప
సింహేంద్రు పెంపును జెంద నేల
ప్రతి లేనియలకల్పలతిక గాకున్నచో
లలి ముద్దులక్ష్మితోఁ బుట్ట నేల
తగుదివ్యసుగుణరత్నంబు గాకున్నచో
ముత్యాలలోనుండి పొదల నేల
యిల సుగంధప్రద మిదియె గాకున్నచో
శ్రీనివాసప్రాప్తిఁ జెలఁగ నేల

తే. వీఁక గలచంద్రరేఖయొ కాక యున్న
లలితసకలకళాప్రౌఢి వెలయ నేల
యని పొగడ మేటి యై మీఱె నతనుఘోటి
భవ్యవాగ్ధాటి శ్రీముద్దుపళనిబోటి. 33

ఉ. పున్నమచందమామ కెనఁబోలుముఖంబు ముఖానురూప మౌ
తిన్ననిపల్కు పల్కులను దేఱిన సద్దయ సద్దయారనో
త్పన్నపుఁజూపు చూపున ధ్రువంబగు నీవియు నొమ్ము లొంచు
మే, న న్నలు వొంద నొప్పు నరనాథులు మెచ్చఁగ ముద్దు
లక్ష్మియున్, 34

క. పద్మారిఁ గేరుమోమును
బద్మాస్త్రుఁడు గోరుగోము బలువాల్గన్నుల్
పద్మాళి దూఱు ననఁ దగి
పద్మావతిరీతిఁ దనరుఁ బద్మావతియున్. 35

సీ. ఘటియింప నేర్తువు కవనజాతు లెఱింగి
పలుకులకల్కి వెల్వెలనఁ బాఱ
నీయఁగా నేరుతు విలఁ గోరినవరాలు
నగరాజసుకుమారి సగము గాఁగ
చెల్లింప నేర్తువు చెప్పినరీతిగాఁ
గనిద్రౌపదీసతి కాన కేఁగ
నటియింప నేర్తువు నవరసంబుల నంటి
తగురంభ యనిమిషత్వము వహింప

తే. నీదె మఱి యుక్తి పరికింప నీదె శక్తి
నీదె నెఱపద్దు నరయఁగా నీదె ముద్దు

సరసముగఁ జేసి రాధికాసాంత్వనమ్ము
భక్తి హరి కిమ్ము శ్రీముద్దుపళనిబోటి. 36

వ. అని నియోగించిన నేనును బ్రబంధనిబంధనోద్యుక్త నై. 37

షష్ఠ్యంతములు

క. శ్రీకృష్ణదేవునకుఁ గరు, ణాకరచారిత్రవిలసదనుభావునకున్
గోకులజప్రియభావున, కాకృతిజితశంబరారిస్వభావునకున్.

క. కౌస్తుభయుతవిస్తృతవ
క్షస్తలునకు భక్తలోకసంరక్షణతా
నిస్తులునకు శ్రుతిమస్తక
హాస్తునకు సమస్తవిబుధపరవస్తునకున్. 39

క. శౌరికి జనవాంఛితసహ
కారికిఁ బాండవకులోపకారికి నచలో
ద్ధారికిఁ గలికలుషౌఘవి
దారికి దనుజేంద్రమదమతంగజహారికిన్. 40

క. అర్జునమదనాభ్యాసున, కర్జునకరకాంతిమందహాసున కతిభ
క్త్యార్జునకృతసహవాసున, కర్జునవాసునకుద్వారకావాసునకున్.

క. కరుణావర్ధిష్ణునకుఁ
బరమమునిప్రకరహృదయవర్తిష్ణునకుఁ
గురుకులగిరిజిష్ణునకుఁ
జిరగుణయుతవిష్ణునకును శ్రీకృష్ణునకుఁ. 42

శ్రీ ర స్తు.

# ప్రథమాశ్వాసము

వ. అంకితంబుగా నాయొనర్పం బూనినరాధికాసాంత్వనం బను
శృంగారప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 43

క. శ్రీవనితావరశుభ్రయ
శోవారిధిపూర్ణచంద్రు శుకయోగీంద్రుక్
భావించి చూచి జనక
క్ష్మావరుఁ డిట్లనియె భక్తిసంభ్రమపరుఁడై. 44

సీ. మునినాథ మును నేను బొందుగా హరికథ
లీనులవిందుగా వింటి నందు
నందుతోఁబుట్టు గోవిందుని కత్తయై
వరగుణాకర యన వఱలురాధ
తా నెత్తి పెంచఁగాఁ దగునిళాసతిమీఁద
వడి నేల బలుకారుబారుచేసి
గోపాలదేవుపైఁ గోపించె నపు డెట్లు
దక్షిణనాయకాధ్యక్షుఁ డైన

తే. దేవకీసూనుఁ డానారితీరు దీఱఁ
దీరుగా నేలె నవి యింపుదేలునటుల
నాన తీవయ్య బహుసావధానమతిని
విని కృతార్థుఁడ నయ్యెద విమలహృదయ. 45

# ప్రథమాశ్వాసము

క. అన విని శుకయోగీంద్రుఁడు
వనజాక్షుని దివ్యపాదవనరుహయుగళిఁ
దనివారఁ దలఁచి యి ట్లనెఁ
గనులం దానందబాష్పకణములు దొలుకన్.

సీ. ఏవంకఁ జూచిన నేణీవిలోచనా
రతికూజితార్భటీరావచయము
లేచాయఁ జూచిన నిందుబింబాననా
వల్లకీవాదనవైభవంబు
లేతావు చూచిన నిభరాజగామినీ
[1]సంగీతసాహితీసంభ్రమంబు
లేదిక్కు చూచిన నింద్రనీలాలకా
భరతశాస్త్రోక్తభావాభినయము

తే. లెందుఁ జూచిన గోపికాబృందగీత
మదనగోపాలసత్కథామహిమ లలర
నంగభవమల్లరంగ మై రంగు మీఱు
బహుతరస్త్రీలతోడ వ్రేపల్లెవాడ.

తే. అందుఁ జెన్నొందునందునిమందిరమున
వాస మై యుండుఁ గౌస్తుభోద్భాసితుండు
దానవవిదారి [2]యిష్టహృత్తాపహారి
భవ్యగుణశాలి మదనగోపాలశౌరి.

సీ. కువలయామోదంబు గొనవచ్చు సత్కీర్తి
నిశికాంతుఁ డగుట సందియము గలదె

---

1 సంగీతసాహిత్య. 2. దుష్టచిత్తాపహారి.

కమలాభిరుచిహేతుకం బైనతేజంబు
దిననాథుఁ డగుట సందియము గలదె
దానవారిసమృద్ధి దనరించునస్త్రంబు
దేవేంద్రుఁ డగుట సందియము గలదె
హంసాహితశ్రీల నలరారునెమ్మేను
నీలాబ్ద మగుట సందియము గలదె
తే. యినకరదళోపలాలనగనుపదంబు
లంబుజాతంబు లన సందియంబు గలదె
యని తనుగురించి బుధజను లభినుతింప
తీవిఁ దళుకొత్తు శ్రీకృష్ణదేవుఁ డనఁగ. 49

సీ. సవరంపుపరువంపుసవరంపురుచి నింపు
నెరిసొంపు గలజంపుకురులతోడ
నలువొందు నెలలందుఁ గళలెందుఁ దగఁ జిందు
తొగవిందుజిగిఁ జెందు మొగముతోడ
నునుదమ్ములను దిమ్ములను నిమ్ములనయమ్ము
గనునొమ్ముసిరి గ్రమ్ముకనులతోడ
నొగిఁ బ్రబ్బుబిగిరబ్బునగుమబ్బు బిగి నుబ్బు
లను ద్రొబ్బుగనబ్బుతనువుతోడఁ
తే. దనర వ్రేపల్లెలోఁ గలతలిరుఁబోండ్లు
హరికపటచర్యలకు మోహితాత్మ లైరి
యెప్పుడును జేరి మెప్పించుచొప్పుఁ జూచి
మరులుపూనరె సతులైన మానులైన. 50

సీ. గురుకుచకుంభము ల్కుధరము ల్గాకున్న
గోపాలకరఘాతిఁ గొనఁగ నేల

కలికివాల్గన్నులు కలువలు గాకున్న
హరిచూపుకాంతిచే నలర నేల
తులమించు మైమీఁగె యలమించుఁ గాకున్నఁ
గృష్ణాంబుధరముతో నెనయ నేల
శ్రీపాదపద్మము ల్చిగురులు గాకున్న
మాధవుచేఁ జెల్వ మంద నేల

తే. యనుచు బుధకోటి పొగడఁగాఁ దనరుకోటి
యన్నువులమిన్న నందునికన్నఁ జిన్న
వారిధరవేణి రాధికాకీరవాణి
ప్రబలును జెలంగ హరిప్రాణపద మనంగ. 51

వ. అదియునుం గాక. 52

సీ. నెరికొప్పుమినుకొప్పునిడుదపెన్నెరులతో
నునుజూపు లీనెడుకనులతోడఁ
గళలు దేఱుచు మీఱుకలికినెమ్మోముతో
విడికెంపు గనుపింపుపెదవితోడ
గెఱగట్టుకొని పుట్టునెఱపూపచనులతోఁ
గడుసన్నగిలుచున్న కౌనుతోడ
జిగి హెచ్చుచును వచ్చుచికిలిలేఁదొడలతో
జడత లొల్కుచుఁ గుల్కునడలతోడ

తే. రమణఁ బొల్గాఱుచెక్కుటద్దములతోడ
మేల్మి గనుపట్టుచిన్నారిమేనితోడఁ
దేజరిల్లును జే రిళాదేవి యనఁగ
రాజగోపాలుపట్టంపురాణి యగుచు. 53

ఆ. ఆమెఁ గూడి దానవాళికిఁ గాలుఁడు
గోపసతుల కెల్లఁ గుసుమశరుఁడు
జలజజాదిసురల కలవరబ్రహ్మంబు
తల్లిదండ్రులకును దనయుఁ డగుచు. 54

సీ. మోహించి యొకక్రేవ ముగ్ధభామామణు
లళికుంజాపులఁ గల్వదండ లొసఁగ
మన్నించి యొకచోట మధ్యాణుమధ్యలు
దెలినవ్వులను సుమాంజలులు నెరప
భావించి యొకప్రక్కఁ బ్రౌఢచంద్రానన
ల్ఘనకుచలికుచము ల్గాన్క లీయ
లాలించి యొకయిక్క లోలలోలాక్షులు
లలి మానధనములు లంచ మంప

తే. నందఱకు నన్నివగల నానంద మిచ్చి
చల్ల సేయఁగ నింటింటఁ జంద్రుఁ డగుచు
మందలో నుండు మన్మథమన్మథుండు
ప్రాభవస్ఫూర్తి రాజగోపాలమూర్తి. 55

తే. విడక దాదు లడుగులకు మడుఁగు లొత్తఁ
గనుయశోదయు గారాబమునను జూడ
గరిమ నందుఁడు గన్నులఁ గప్పుకొనఁగ
రాధ పోషింపఁదగునిళా రాజవదన. 56

సీ. శౌరిని గని రాధ చనుగుత్తు లివిగో కొ
మ్మన లేవె తన కింత యను నిళయును
మురవైరిఁ గని రాధ మోవిపం డిదుగో కొ
మ్మన లేదె తన కింత యను నిళయును

వరుని గన్గొని రాధ నెరిపించ మిదిగో కొ
　　మ్మన లేదె తన కింత యను నిళయును
బద్మాక్షుఁ గని రాధ పలుకెంపు లిచ్చిగో కొ
　　మ్మన లేవె తన కింత యను నిళయును
తే. హరిని గని రాధ యలయాట లాడుదాము
పడుకటింటికి ర మ్మనితోడరి పిల్వ
నాడ నేఁగూడ వచ్చెద నను నిళయును
నవ్వి రాధికామాధవుల్ రవ్వ సేయ. 57
సీ. మురువుగా దాఁగిలి మూఁత లాడెడు వేళ
　　యదురాయలకుఁ బల్మ రెదురుపడును
రీతిగా గుజగుజరేకు లాడెడు వేళ
　　మదనగోపాలుని గదిసి నిలుచుఁ
గొమరుగా వెన్నెలకుప్ప లాడెడు వేళ
　　మురవైరిచేఁ గను ల్మూయ నిచ్చు
గుములుగా గుజ్జనగూడు లాలెడు వేళఁ
　　గంసవిద్వేషిచెంగట వసించు
తే. నెట్టులైనను దేవకిపట్టికరము
గరము తను సోఁకఁగాఁ గనికరముచేత
సుదతి యలనాఁడె సైగఁగాఁ జూచుఁ బ్రోడ
లమ్మచెల్ల యి దెంత చిత్రాంగి యనఁగ 58
సీ. పాడించు నొకవేళ బహుదేశ్యరాగము
　　ల్మోగించు నొకవేళ జంత్రవాద్య
మెటిఁగించు నొకవేళ భరతశాస్త్రప్రౌఢిఁ
　　బట్టించు నొకవేళ భావరసము

నెగడించు నొకవేళ నెరిశాస్త్రసంగతు
లనుపించు నొకవేళఁ గవనరీతి
బోధించు నొకవేళఁ బూవిల్తుశాస్త్రంబుఁ
జదివించు నొకవేళ శయ్య లోలి
తే. నూటి పోయు మఱొకవేళ నారజంబు
వచ్చె ననిపించు నొకవేళ వాద్యవిధము
నెపుడు చూతునో యిదె శౌరి నేనయ ననుచు
దయ నపుడు పొంగి యిళకు రాధాలతాంగి.
క. నలు గలఁదు జలక మార్చుచు
జలువలు గట్టించు పద్రసాన్నము లుంచుక్
దెలనాకుమడుపు లిచ్చును
గలికీ ర మ్మనుచుఁ దీసి కవుఁగిటఁ జేర్చున్.
సీ. ఒమ్ముగా దిమ్ము లై రొమ్ము రావలె నంచుఁ
గులదేవతల నెల్లఁ గోరి కొలుచు
నిడుదలై మెఱుఁగెక్కి నెరికురుల్ పెరుఁగంగ
దిన మొకతైలంబు దెచ్చి యంటుఁ
గలికికన్నెరికంబు దొలఁగఁ జెంచుల కెంతో
యిచ్చి తీసినమందు లిచ్చు నిచ్చ
నెప్పు డీడేరుపో యీముద్దరా లని
యుపవాస మొకవేళ నుండనియదు
తే. వగలు నైనేసి చెలి యుండు సొగసుఁ జూచి
దృష్టిపై దృష్టి తీసుక తెలియ నాదు
సవతి వౌదువె యని చెక్కుఁ జఱచి మోము
మోమునఁ గదించి నూఱాఱుముద్దు లిడును.

క. సతి నిట్లు రాధికామణి
సతతము గనుగందనీక చనువున మనిచెఁ
రతిమగనితోఁటలోపల
లతకూనను బెంచినటుల లలితము గాఁగన్. 62

తే. కొమ్మ కటు యౌవనవసంతగుణ మెసంగఁ
దొలుతఁ గనుపట్టు బాల్యజాతులు దొలంగఁ
గరముచివురులు తోవ రెక్కఁ గడమతావు
లొఱపు మీఱెను కోకిలస్వరము లొదవె. 63

సీ. అధరబింబంబున కరుదెంచుచిలుకల
పలుకులో యన ముద్దుపలుకు లమరె
ముఖచంద్రమండలంబును గ్రహింపఁగ వచ్చు
పెనురాహువో యన వేణి యమరె
నలు వొందునాభిపున్నాగంబునకుఁ బొఱు
నళులబా రనఁగ నూఁగారు దనరెఁ
బదపద్మయుగళంబు గదిసి పోకున్నరా
యంచ యంచన మందయాన మెసఁగె

తే. మీఱు బహునవశ్రీ ల్బెందినాఱు గనుక
విన్నవించెద నని తళ్కుబెళ్కు లమరఁ
జేరెనో తెల్ప ననఁ గను ల్చెవులఁజేరె
రమణి కటుచాలయౌవనారంభవేళ. 64

తే. గుబ్బగుబ్బలులను ద్రొబ్బి నిబ్బరముగ
గుబ్బెతకు గబ్బిసిబ్బెంపుగుబ్బ లుబ్బె
సరసయౌవనమానససరసిలోనఁ
బొడముబంగరునునుదమ్మి మొగ్గ లనఁగ. 65

తే. అరయఁ దనజోడు బయలాయె ననెడువంత
చిత్తమున నాట నాఁటఁ జిక్కెఁ గాను
మానహానికి సైతురే మహిని దలఁప
బట్ట గట్టినబలుగుణవంతు లెల్ల. 66

సీ. వెన్నునిముఖచంద్రబింబంబు కళ దేఱఁ
దరుణిలోచనకుముదంబు లలరె
శౌరికిఁ జికురాంధకారము ల్పెరుఁగంగ
ముకురాస్యనఖరతారకలు వెలసె
వనజాక్షువక్షఃకవాటంబు జిగి మీఱ
బిబ్బోకవతిచనుగుబ్బ లుబ్బె
స్వామికి భుజకల్పశాఖలు బలియంగ
నతనాభికిని బాహులతిక లెనసె

తే. హరికి యౌవనవాసంత మతిశయిల్ల
నాతికిని బికకలకంఠనాద 'మొదవె
భళిర యిటువంటియీసతీపతులజాతి
రీతు లమ్మయ్య యని రతిప్రియుఁడు వొగడ. 67

ఆ. చికిలిసానఁ దీర్చుజీవరత్నమురీతిఁ
బరువ మైనకుసుమవల్లి పగిది
మెఱుఁగు చేసినట్టిమేల్మిబొమ్మవితాన
రమణి దనరె జవ్వనమున నపుడు. 68

తే. శుభదినంబున సప్తమశుద్ధి గలిగి
చెలఁగు వేళను గురుమాపుచీరతోడ
సరసరుచిరాన్నభోజనోత్తరమునందు
నీ డెఱుంగనిచేడియ యీడుమీఱె. 69

సీ. మనయశోదను జేరి మనయిళ్ళ పుష్పించె
నని చెప్ప బహుమతు లందరమ్మ
తెలియఁగా రోహిణీదేవిని రప్పించి
యాచిన్నెలో కావా యరయరమ్మ
చుట్టపక్కాలకు శుభపత్రికలు వ్రాసి
పంప మామకు శ్రుతపఱచరమ్మ
దినశుద్ధి లగ్నంబు గని సాంగ్యములు దెల్ప
వేగ గర్గుని బిలిపించరమ్మ
తే. కలికిలతకూన పుష్పిణిగాఁ జెలంగె
నెవరు గన్నారు మాధవు నెనసె నేమొ
మందు లీవలె సాంబ్రాణిమధురమధువు
మంచిఖర్జూరములను దెప్పించరమ్మ. 70
క. అనువనితలగుసగుసలను
విని కనులను జలము లొలుకఁ బెనుసిగ్గుపడన్
వనజాక్షిని గని రాధిక
చినిచిన్నెలకన్నె నెన్ని చేసెద రనుచున్. 71
సీ. అంటు గల్గినవారి నంటుకో నియమించి
పడఁతిని మగరాలపలక నుంచి
విప్రసువాసినీవితతిచేఁ బాడించి
ననమేనఁ గుంకుమనలుగు లుంచి
చలువగొజ్జఁగినీట జలకంబు లాడించి
తడి యొత్తి కురు లార్చి జడ ఘటించి
పస మించు కెంబట్టుపావడ బిగియించి
రంగుచెంగావిరోకను గదించి

తే. రవిక తొడిగించి సొమ్ము లలంకరించి
జాజు లెనయించి కల్పముల్ సంఘటించి
యరుగుపై నుంచి పాలు పండ్లలవరించి
క్రోల నిప్పించి చిమ్మిలిగొట్టఁ బంచి. 72

తే. భేరి మొదలగువాద్యము ల్మ్రోయుచుండఁగ
వరుస నెనయించి చెలి కొడిఁబ్రాలు గట్టి
కుంకుమరసంబు కస్తూరికుసుమములును
బంధుమిత్రాప్తతతి కిచ్చి పంచి రాధ. 73

తే. చాన ని ట్లరపడకింటి లోని కనిచి
మొల్లపూఁబాన్పుపై న త్తమిల్ల నునిచి
దగ్గఱను నింబదళము బెత్తంబు నునిచి
యుగ్మలుల నందు జాగరంబుండఁ బనిచి. 74

తే. మాంత్రికులఁ బిల్చి యిలుచుట్టమంత్రయంత్ర
తంత్రములఁ గూర్చి నల్దెసల్ తప్పదారి
భూతముల నెందుఁ జొరనీక భూతిఁ జల్లి
కలికిఁ గాపాడెఁ గనురెప్ప గాచినటుల. 75

తే. వేడ్కఁ గావించి మరునాఁడు పిట్టుఁబెట్టి
కలశముల నెత్తి సీమసీమలకుఁ దనియఁ
బంచి పంచమదినమునఁబసపు నూనె
యందఱికిఁ బోసి చెలిని బెండ్లరుఁగు నుంచి. 76

తే. తరుణు లప్పుడు సంపెంగతైల మంటి
మించుఁబోఁడిని దాన మాడించి రెలమిఁ
దమ్మిగుమ్మితిదొరచేతితలిరుటాకు
చికిలిబాకును దేజామాల్ చేసినటుల. 77

సీ. పరిమళంబులు మట్టికురు లార్చె నొకభామ
చక్కఁగా జడ వేసె నొక్కలేమ
కస్తూరితిలకంబు ఘటియించె నొకజంత
బుక్కము మైఁజిల్కె నొక్కకాంత
కెంబట్టుపావడ గీలించె నొకబోఁటి
యొగి రైక ముడి వెట్టె నొక్కజోటి
హారంగోక మొలఁగట్టె నొకమదావళయాన
యొనవించె మణిభూష లొక్కచాన
తే. తరుణి యొక్కతె నిల్వుటద్దంబుఁ జూపె
రమణి యొక్కతె మేనగందము నలందెఁ
బడఁతి యొక్కతె యగురుధూపంబు వైచెఁ
జేడియకు నిట్లు రాధ కై సేయు వేళ. 78
తే. తెలిన యీరీతి నిండుము స్త్రీబుతోడ
నుల్లసిల్లెను మల్లెపూఁజల్లు లలర
నవ్వగలచివ్వలకుఁ గాలు ద్రవ్వకొనుచు
మరునిపడివాగెపై గోచ మట్టు నువఁగ. 79
క. అంతటఁ గాంత లిళాసతి
వింతగఁ గైసేసి తెచ్చి వెల గలపుగ రా
సంతనల మంతు కెక్కిన
దంతపుఁబనిచవికెలోన దయ దనివారన్. 80
తే. మేల్మిపచ్చలగద్దియమీఁద నుంచి
చేరి యనసూయ మొదలగు పేరఁటాండ్రు
మనయిళామాధవులకు శోభన మటంచు
జల్లఁగాఁ బాడి సుంకులు చల్లి రపుడు. 81

సీ. చెక్కుటద్దములపైఁ జెమటబిందువు లూరఁ
గస్తూరితిలకంబు గరఁగి జాఱఁ
గరకంకణంబులు ఘల్లుఘ ల్లని మ్రోయ
నలువంకఁ జూపువెన్నెలలు గాయ
స్తనభార మోర్వక తనుమధ్య మసియాడ
నిండుమోహంబుతో నీవి వీడ
నబ్బిసిబ్బిపుటుబ్బుగుబ్బచన్గవ పొంగ
బాహుమూలోజ్జ్వలప్రభ లెసంగఁ
తే. గటితటంబునఁ గీల్జడ నటన మాడ
గగనమున కేఁగునిట్టూర్పు గాడ్పుతోడఁ
దాళగతు లొప్పసంపెగ తైల మంటెఁ
దమక మెదనాటి హరికి రాధావధూటి. 82

తే. చెలులచే యానుకొని లేచి కలికి యుడిన
పాదుకలు మెట్టి రాజసప్రౌఢి నేఁగి
మేటిమగరాలముక్కాలిపీఁటమీఁద
శౌరి కూర్చుండె మజ్జనసదనమునను. 83

క. లికుచకుచ శౌరి కత్తరి
లికుచరసం బిడియె నఖరరేఖలచే నొ
క్కొకటిగఁ జిక్కెడలింపుచుఁ
బ్రకటితఘననీలకేశపాశంబందున్. 84

క. కుంకుమ నలు గిడె నొకచెలి
పంకజదళనేత్రుమేన భావములోనన్
డెంకగునను రాగరసం
బింకఁగ వెలిఁ దీసి విభున కిప్పించె ననన్. 85

క. గంధామలకము వెట్టెను
గంధేభసమానయాన గనుకని గరముల్
గంధతను లంది యియ్యఁగ
గంధవతీధవున కపుడు గరిమ దలిర్పన్. 86

తే. పసిఁడిగిండులచే ముంచి పడఁతు లియ్య
జలక మార్చెను జెలువ గొజ్జంగిసీట
రమణునకు రాధ మదనసామ్రాజ్యమునకుఁ
జెలఁగి పట్టాభిషేకంబుఁ జేసె ననఁగ. 87

సీ. కురు లార్చె నొకలేమ సురటి నొక్కతె వీవ
పరిమళాగురులధూపముల నొసఁగి
సిగ వైచె నొకభామ నిగరాలతాయెతు
లీలించి జంటరుమాలు గట్టి
విరు లుంచె నొకరామ విదళించి పన్నీటఁ
బద నిచ్చె గోవజవ్వాజిఁ జమిరి
పట మిచ్చె నొకచాన యటు విప్పి నలుగంగ
నీక తావులు గట్టి నెగయఁ బట్టి

తే. తిలకవతియోర్తు కస్తూరితిలక మునిచె
గంధగజయాన యొక్కతె గంధ మలఁదెఁ
దడవుగా నోర్తు రత్నాలతొడవు లిడియె
శౌరికిని జాల నయ్యలంకారవేళ. 88

క. ఎనిమిదిదిక్కులరాజుల
ఘనకీర్తులు వచ్చి యతనిఁ గవిసె ననంగా
మనుము త్తెపుఁజొకట్టులు
వినుతాంగి యిడంగ శౌరివీనుల మెఱసెన్.

తే. కళలు పదియాఱు నేఁ గంటి ఘనుని మోము
గనియె నరువదినాలుగు కళ లటంచుఁ
గలఁగి కమలారి హరిపదాక్రాంతుఁ డయ్యె
ననఁగ మగరాల పెండియం బునిచె నొకతె. 90

క. మగువ యిడ హరియురంబునఁ
దగియెన్ జిగిచిలుకతాళి ధర నాతనిబల్
సొగసు గని చిత్తజన్ముఁడు
దెగిపాఱఁగఁ బట్టువడిన తేజి యనంగన్. 91

క. మగరాలపతక మొకచెలి
దగిలింపఁగ శౌరియెదను దగె నాలోనన్
వగ నీనుతోఁ గలరాయఁడు
సొగసగు తల్లిలఁ దొంగి చూచె ననంగన్. 92

తే. కూర్మి నిఁక నిట్లిళాదేవి గోరు లుంచు
ననెడువగ గోళ్లకుట్టికంటు నునిచె నొకతె
యందులకు గాఢ కెంపుల నందగించు
నిట్టు లనఁ గౌస్తుభము శౌరి కిడియె నొకతె. 93

తే. రమణి గీలించు తారహారము మురారి
యురమున వెలింగె నెదలోన మెఱయుచున్న
తనవరుని బంపి మఱి యిళాతరుణి నెనయు
మనుచుఁ దారక లటువలెఁ గొనె ననంగ. 94

తే. చాన గీలించు నీలకంజాతసరము
మెఱసెఁ జిన్నికృష్ణుని విప్పటురమునందు
మారు లేనితన్మోహనాకారమునకుఁ
జంచలాక్షులు దృష్టి తాఁకించి రనఁగ. 95

తే. పడఁతి గట్టిన కాంచనాంబరము దనరె
నంబుజాక్షుని స్వచ్ఛదేహంబుమీఁద
నతనిమోద నిండి తగునాదయారసంబు
పైని దా నిట్టులను గానవచ్చె ననఁగ. 96

క. తోఁగముగని బావ నిట్టుల
వగఁగాఁ గ్రైనేసి తెచ్చి పనిహార్వులహా
స్మగరాలచవి కెలోపలఁ
దగుపచ్చలపీఁట నునిచి తరుణులు వేడ్కన్. 97

తే. చని యిళాదేవిఁ గని లగ్నసమయ మాయె
రమ్ము కూఁాయమ్మ యని క్రమ్మి కొమ్మలెల్ల
బలిమిఁ గొని పిల్వ రాధికభయముచేతఁ
దగ్గి దిగ్గున లేచి సుఁ సిగ్గు మాని. 98

చ. వలపులచంద్రకావిజిగిపావడగంగుఁ లెసంగఁ బైరిణీ
జిలిబిలిచీరకుచ్చెళులు చిందులు ద్రొక్కఁగ జంటిరైకలో
పలిచనుగుబ్బ లుబ్బఁగను బంగరుటందెలు ఘల్లుఘల్లనన్
జలజదళాక్షి వచ్చె శుభసంబున నయ్యదురాజునొద్దకున్. 99

తే. అప్పుడు సుముహూర్తమునుచు గర్గాదిమునులు
శోభనముఁ జేసి నిత్యశోభనులకు
వాద్యములు మ్రోయ నిఖిలదిక్పతులు పొగడ
నాప్తబంధుసుహృత్కోటి తృప్తిఁ బొంద. 100

క. ఆవ్వేళను హరియు నిళా
యావ్రతరత్నంబు బాంధవావలితోడన్
బువ్వము దిని దారుచులకు
నువ్విళ్లూరుచును మెప్పు లొసఁగుచు నంతన్. 101

క. నందుం డందఱుఁ బరమా
నందంబును నొందఁ జేసె నమ్మైశ్వర్యా
దం దగుసూనృతభాషా
సందోహముచేఁ బటాదిసత్కారములన్. 102

తే. అంత సంతోషసంభరితాంతరంగుఁ
డగుచుఁ దాంబూలఫలదాన మాచరించి
యతివయును దాను శ్రీరాన్న మారగించి
యువతి యిడురత్నపాదుకా యుగళి తొడిగి. 103

చ. చలువ లెసంగుచప్పరపుజంత్రపుబొమ్మలు పావురంబులున్
గిలకలమంచము న్విరులు నించినసెజ్జయుఁ గీచుబుఱ్ఱయున్
దలగడదిండ్లు దోమతెర తళ్కునుడోలిక నిల్వుటద్దముల్
గలపడకింటి కేఁగి యటఁ గంజవిలోచనుఁ డుండె నత్తఱిన్.

సీ. వలిపెచెంగావిపావడకొసల్ బిగియించి
కుంకుమపువ్వంచుకోక గట్టి
కలపంబు నెమ్మేనఁ గలయంగ మేదించి
పావడిల్లుముత్యాలరవికె దొడిగి
గేదంగిరేకులఁ గీల్జడ ఘటియించి
చంద్రసూర్యాదిభూషణము లుంచి
పొలుపుసంచపురేకుబుక్కాము మైఁ జల్లి
కస్తూరితిలకంబు సిస్తుమీఱిచి

తే. గోవజవ్వాజి మెడను గీల్కొల్పి జఘన
మునకు నగురుసాంబ్రాణికొంబొగలు పట్టి
కనులఁ గాటుకరేకలు కదియఁ దీర్చి
రాధికామణి యిళికు నలంకరించి. 1

క. నిద్దపుటద్దముఁ జూపిన
ముద్దియ తగ నబ్ధిమధ్యమున బింబితమై
ముద్దులు గులికెడుకలుముల
ముద్దులగుమ్మ యన భువనమోహిని యగుచున్. 106

సీ. ఎటు తాళ నున్నదో యీకొమ్మ కెమ్మోవి
కైటభారాతిపల్లాటులకును
ఎటు లోర్వ నున్నవో యీకన్నెచన్నులు
గోపసింహునిగోటిగుమ్ములకును
ఎటు లాన నున్నవో యీతన్వి లేఁదొడల్
చాణూరహరుమారుసాదనలకు
ఎటు లాగ నున్నదో యీనాతినును మేను
దంతిమర్దనుకౌఁగి లింతలకును
తే. నంచుఁ దను గేలి యొనరించుమించుఁబోండ్లఁ
గాంచి తలవంచి సిగ్గుచేఁ గలఁకఁబాలు
వారిజాననవీనులవద్దఁ జేరి
బుద్ధిగా నిటు లను రాధ బుజ్జగించి. 107

సీ. చెలువుండు కౌఁగిటఁ జేర్చినయపు డీవు
గుబ్బల మెలమెల్లఁ గ్రుమ్మవమ్మ
విభుఁడు చెక్కిలి ముద్దువెట్టినయపు డీవు
నలరుమో వొక్కింత యానవమ్మ
సామి పైకొని రతి సల్పినయపు డీవు
నించుక యెదురొత్తు లియ్యవమ్మ
ప్రాణేశుఁ డలకేళి బడలినయపు డీవు
పురుషాయితము వేగఁ బూనవమ్మ

తే. అతఁడు నవరసరసికశిఖావతంసుఁ
డధికసుకుమారమూర్తి నీ వతని నెటుల
వలచి వలపించుకొనియెదో పలికినాను
నాన గొనఁబోకు నామీఁదియాన నీకు.

క. అని మనసిజాగమనమ్ములు
విను మని యుపదేశ మిచ్చి వే లె మ్మిదిగో
యొనసెను శుభలగ్నము ప్రియు
నెనయఁగ వలె వేళ తప్పనియ్యక యనుచున్.

క. మరుగంధసింధురంబును
గరముం గదలించి తెచ్చుకరణిని దెలివన్
వరుకడకు బలిమిజాలుములు
మెఱయఁగఁ గొని తెచ్చి పలికె మెల్లన హారితోన్.

సీ. పదపద్మముల నొప్పు బంగారుగొలుసులు
మేలు కుల్కాడునిగళాలు గాఁగఁ
కటితటి నటియించుగంటలమొలనూలు
పాలాదిగంటలచాలు గాఁగ
నల్లచీమలబారు నా మూరునూఁగారు
మేర మీఱినమదధార గాఁగ
గబ్బిసిబ్బెపుటుబ్బుగుబ్బగుబ్బలు లెంతో
మంతుగన్ వింతకుమ్భములు గాఁగ
తే. గందవడిలోన దుమ్మాడి మందగతుల
వచ్చు నెరితావి కళులచాల్వాల గొనంగఁ
జిన్నిమరుదంతి ని న్నొకసన్నఁ జూడ
సరస నెక్కెడు మీఁదిపై సరము లేఁగ.

సీ. ఈగోటిమీాటుల కీకుచగిరులట్లు
పొంగి తాళవు చేని మొగ్గచన్ను
లీపంటిగంటుల కీమోవిపగడంబు
వగను దాళదు దీనిచిగురుఁబెదవి
ఈమారుసాదన కీయూరుకాండంబు
లటులఁ తాళవు కీలియనఁటితొడలు
ఈకౌఁగిలింతల కీతనుకనకంబు
వలెను దాళదు దీనిమొలకమేను
తే. నీకు సరి యగునటు లెల్ల నేను గాను
పొల మెఱుంగని దిది వట్టిముగ్ధ గాని
తెలిసి యెటు లేలెదో నీకుఁ దెలుప వలెనె
దేవ దక్షిణనాయకాధిపుఁడ నీవు. 112

సీ. కొననాల్కఁ గొని మోవి చెనకి చూతువు గాని
యగరంటుఁగా నొక్కి యూనఁబోకు
ముద్దుచెక్కుల జిన్ని ముద్దు లుంతువు గాని
జిగిగోటికత్తులఁ జీరఁ బోకు
మొనవేళ్ళఁ జనుమొనల్ పుడుకు దింతియ కాని
వగవగ బిగిపట్టు పట్టఁబోకు
రతికేళి మెల్లమెల్లన సల్పుదువు గాని
దురుసు పైపనములు నెరపఁ బోకు
తే. వెఱ్ఱి నై తెల్పెదను గాని వెలఁది నీవు
వలపులను మించి గడిదేఱి వద్దఁ జేరి
మారుసాములఁ జలపోరి పోరువేళ
నాదుగుఱికట్టు నిలుచునా నలినయన. 113

తే. అంచు హరిచేతి కీర నొప్పగించి రాధ
వత్తు నేఁ గూడ నని చెలి పైఁటఁ బట్ట
వేగ వచ్చెద నని విడిపించుకొనుచుఁ
జనియె మది ఖేదమోదముల్ పెనఁగొనంగ. 114

వ. ఇట్లమ్మందయాన యమందయానంబునఁ బడుకయిలు వెల్వడి రత్నముద్రికాలంకృతం బైన కెంగేల నొక్క బాలికామణిం జెయ్యానుకొని యవ్వాసుదేవు నెడఁబాసి పోవం జాలనిచిత్తంబుతోన తత్తఱపడి యమ్మత్తకాశినులం గని తలుపోర సేయుం డనునెపంబున తిరిగి చూచుచు రాజసంబవలంబించి యెవ్వరితోడం బలుకక డగ్గుత్తియ నడంపుచుఁ గేళీపూగుత్తులాఘ్రాణించుపోలిక బెట్టునిట్టూర్పులు నిగుడింపుచుఁ జెందొగలవిందుఁ గనుచందంబున వదనారవిందం బెత్తి కందోయిం గ్రందుకొను బాష్పబిందుబృందములఁ జిప్పిలనీక ఱెప్పల నార్చుచు హరివిరహాభరంబునం దాఁకి జారినకరకంకణంబులం గని చేయెత్తి కప్పుకొప్పు దిద్దుకొనుచొప్పునఁ గప్పుచుఁ గుచలికుచంబులం దగదగ మని తగులుకొను చిగురువిలుగలతులువసెగలఁ దగిలి చిటిలి పెటిలి పడుతారహారంబులం బయలుపడనీక పయ్యెదచెఱంగున మఱుంగు సేయుచు నిజమందిరంబుఁ బ్రవేశించి యం దొక్క చోకాటంపుసులుపు పట్టు మేలుకట్టులంగనుపట్టు కట్టాణిముత్తియంపుజల్లులతో నల్లిబిల్లిగా నల్లుకొను బొండుమల్లియల పూదండలం దగిలి రొదలు సేయుతుమ్మెదల గరులనిగనిగలకుం బదు లనఁగఁ దగిలి మగరాలసోరనగండ్లనుండి వెలికి నిగుడు నగురు సాంబ్రాణిపొగల మగుడం ద్రోయుచుఁ దెర

గంటి మచ్చికంటులనెరినెరుల వలఱలు విరుల చేరులనెత్తావుల
నత్తమిల్లి మత్తిల్లి వచ్చుకమ్మతెమ్మెరలవగ మిగులుమగరాల
సౌధంబున నెంతయు వింతవింతపని సంతనల మంతు కెక్కు
జీవదంతపుఁ జప్పరకోళ్ళ మంచంబుపై రవిబింబంబుడంబు
విడంబించు కెంబట్టు పగుపుర రాజినశిఖారేఖల సెకమీఱు
సూరెపుటంబు తలగడఁజేరి యొక్కపల్లవపాణి పద
పద్మంబులు పట్టుచుండఁ బవ్వళించి యాత్మగతంబున. 115

ఆ. సొమ్ము లియ్యవచ్చు సొమ్మంద మియ వచ్చుఁ
నియ్యరాని ప్రాణ మియ్యవచ్చుఁ
దనదువిభుని వేరుతరుణిచేతికి నిచ్చి
తాళ వశమె యెట్టిదాని కైన. 116

సీ. నాతి యింతకు మున్నె నాసామిమధురాధ
రామృతమ్మును జూఱ లాడ కున్నె
యతివ యింతకు మున్నె హరివిప్పుటురముపై
గుబ్బలకసి దీఱఁ గ్రుమ్మ కున్నె
రమణి యింతకు మున్నె రమణుకౌఁగిటఁ జేరి
పారావతధ్వనుల్ పలుక కున్నె
చాన యింతకు మున్నె శౌరి పైకొన వెను
దియ్యక యెదురొత్తు లియ్య కున్నె

తే. మున్నె యది జాణ సిగ్గుచే నున్నఁ గాని
విభుఁడు వగఁ జేసి తనుప్రీడ వీడఁజేసి
చేరఁగాఁ దీసి యందందుఁ జేయి వేసి
కొమ్మ నిటమున్నె తా దిద్దుకొనక యున్నె. 117

క. అని చింతింపుచు నచ్చటఁ
గనువిలుతుని బారి కలికి కను మూయక లో
వనరుచు నుండెను రాధిక
వనరుహదళనయనుఁ డచట వనితామణితోన్. 118

క. చెలియా వింటివె రాధా
జలజేక్షణమాట లెల్లఁ జక్కఁగ ననినన్
గలకంఠీమణి సిగ్గునఁ
దల వంచుకొనంగఁ జూచి దయ దైవారన్. 119

సీ. చిన్ననాఁటనె చెల్మిఁ జేసితి మెడ లేక
మన కేటిసిగ్గులే మధురవాణి
నేఁ బల్కఁగా లేదె నినుఁ జూచి ననుఁ జూచి
యీవేళ మాటాడ విందువదన
కూడి యిన్నాళ్ళాటలాడమో యెటుపోయె
నాయాట లీయాట లంబుజాక్షి
పోనిపోనీ నేను బోరుగూరివాఁడనా
నీకు మేనరికంబు నీలవేణి

తే. యళుకు లేటికి ననుఁ జూచి కులుకులాడి
మోముఁ జూడవె మోమెత్తి మోహనాంగి
ముద్దుగా ముద్దు లియ్యవే ముద్దుగుమ్మ
మాటు కేఁగకె నాపూన మందయాన. 120

క. మనరాధ దెలిపె నేటికి
ననువుగ నా ల్మగనిమాట లాడక యున్నన్
మనసిజభూతము వెలిపుం
గనిపించు నటంచు వేగఁ గదియుద మబలా. 121

క. చన డిటు లూరక యుండఁగఁ
గనువినుదయ్యంబు గదుమఁగా వచ్చినయా
వెనుక నెటు దాఁగువారము
మనసిగ్గులు దాని నెదిరి మార్కొన వనుచున్. 122

చ. గమగమతావులం గులుకుకప్పురబాగము లిచ్చి వేడ్కతో
సమముగఁ గ్రొత్తము త్తియపుసన్నపుసున్నముఁ బెట్టి చో
క్కపుం, దమలపుటాకుఁ జుట్టి వనితామణిచేతి కొసంగఁ బో
వుచోఁ, గొమిరె నయంబుతోఁ గొనిన గోపకులాభరణుండు
ప్రేమతోన్. 123

సీ. ఉసికొల్పి వంచించి దుసికిలుచనుదోయి
చే నంట నమ్మ నొచ్చినె యనును
మొనసి యేమరఁ జేసి మోవాన గమకించి
వడి నుల్కి కరపల్లవములఁ గప్పు
నల్లందులకుఁ జొచ్చి యటు నీవి వదలింప
మిట్టిమీ నై బెట్టు కొట్టుకాడు
విభుఁ డందుఁ జెనకి తా వికవిక నవ్వుచో
నటు గిరుక్కున మల్లియలుక నించు

తే. తను గుఱించినఁ గని తసకనులు మూయుఁ
గవకవల్ నించుచో ప్రేళ్లు చెవులఁ జొనుపు
కొను నిళామానినియు ముగ్ధతనముఁ బూని
రాజగోపాలసంగమారంభవేళ. 124

ఉ. ముద్దులబెట్టు కొంత జిగిమోముగదింపుల వింత మోహపుక్
సుద్దులచే రవంత తెలిచూపుల నంత విరాళిచేఁతలం

బద్దుల సుంత పావురపుఁ బల్కులు పల్కి కలంతసిగ్గు పో
దిద్దుము రారి నారినటు తెప్పునఁ బైకొని మోవియానుచున్.

మ. అలరు ల్వాడ రుమాల వీడ నెదపై హారాళు లల్లాడఁ ద
ళ్కులచౌక ట్లసియాడఁ బావురపుఁబల్కుల్ పల్కుచున్
గుల్కుచున్, బలుజోకొట్టుచు మబ్బుదట్టుచును బైపై ని
క్కుచున్ సొక్కుచున్, గళ లెల్ల న్గరఁగించి యేలె సొగ
యం గంజాస్త్రుకయ్యంబునన్. 126

చ. గొనకొనుసిగ్గు మోహమును గూడఁగ నొక్కటి కొక్క
టెక్కుడై, పెనఁగొను కేలు మోమువయిఁ బెట్టుక మెల్లన
వ్రేళ్లసందులన్, గనుఁగవ రెప్ప లార్పక యొగాదిగఁ గన్గొనె
శౌరివక్త్రమున్, మనసిజకేళినైపుణిని మానక మానిని
యప్పు డెంతయున్. 127

చ. ఉలుకును గొట్టుకాడు నగు నూర్పు లడంపుచు నూర
కుండు లోఁ, గలఁగును బల్కఁబోవుఁ దటకాపడుఁ గన్గొనుఁ
గన్మొగుడ్చు మైఁ, బులకలు దార్చు గ్రుక్కు లిడు బొమ్మల
మై మఱచున్ సుఖోన్నతిం, దలకొని పారవశ్యమునఁ
దామరసాక్షి య దేమి చెప్పుదున్. 128

సీ. మో మెుకించుక యెత్తిమోవి యానఁగ నొత్తి
యది యిది చాలించి యట్టెయుండుఁ
గౌఁగిలించఁగఁ జూచి కరపద్మములఁ జాఁచి
యందు కిందుకుఁ బోక యట్టె యుండుఁ
జనులఁ గ్రుమ్మఁగఁ గోరి సరస మెల్లనఁ జేరి
యవల కీవల కేఁగ కట్టె యుండుఁ

చౌరుషంతి కెచ్చి పైకొన గమకించి
యటు నిటులను జేయ కట్టి యుండు
తే. ముద్దు లిడ వచ్చి యందందుఁ బ్రొద్దు పుచ్చుఁ
బలుకఁగా మాఱు నెలుఁగెత్తి కలఁకఁబాఱు
విడె మొసఁగఁ బోవు సగమాకు మడిచి మానుఁ
దీరి తీరనిసిగ్గుంఁ దెఱవ యపుడు. 129
వ. ఇట్లనేకవిధంబుల నిళామాధవులు భంగురానంగసంగరక్రీడా
పరవశు లై యున్న యెడ. 130
చ. భువిఁ బథికాళి యాత్రలకుఁ బోవఁగ నైష్ఠికవిప్రసంఘముల్
జవమున లేచి తానములు సల్ప రతాంతరసుప్తదంపతుల్
గవిసి రమింప వేళ యిది గాదె యటంచుఁ ద్రిభంగులన్నెరా
హావణికె నుగ్గడించెఁ జరణాయుధబోధకయూథ ముద్ధతిన్.
ఉ. అంతట దిగ్గునన్ బఱుపు నంటక లేచి పయంట దిద్దుచున్
వంతను గొంత దాఁచి బలవంతపుహాయి రవంత పూని చె
ల్మింతులు చెంతలం బిలువ కేఁగిన దేమొ యటంచు నల్కరాఁ
గంతునితండ్రిని న్నదియఁగాఁ జని రాధిక తల్పుతట్టినన్. 132
తే. చేరి యందాఁక వారు చౌశీతిబంధ
గతులఁ బెనఁగి చాలక పునారతులఁ గలసి
బడలికలు దీఱ నొక్కింత పవ్వళించి
మదవతీకృష్ణు లప్పుడు నిదుర లేచి. 133
సీ. మిసిమిచెక్కులఁ దమ్మరసము నాథుఁడు పెంపఁ
బికవాణిమోవి కాటుకను బెంపఁ
జెదరినముంగురుల్ శ్రీనివాసుఁడు దిద్దఁ
గాంత జాఱినతిలకంబు దిద్ద

నలగోరువంకల నతఁడు కుంకుమ నించఁ
గలికి పల్గంటికిఁ గప్పుర ముంచఁ
గప్పు పెన్నెరికొప్పు కాంతుఁ డల్లనఁ బాపఁ
జెలియ హారావళుల్ చిక్కు (బాపఁ
తే. జుట్టి సగమాకు నోటికి సుదతి యొసఁగ
మరలి మురవైరి కొఱికిన మడుపు లొసఁగ
నట్టియెడ రాధ కరకంకణాళి ఘల్లు
రనఁగ వినె నుల్లములు ఝల్లు మనఁగ నులికి. 134
తే. కలికి వే లేచి గడె దీసి తలుపు దెఱవ
శౌరి రమ్మన రాధిక చేరఁ బోవు
నంతకును మున్నె నారి చెవిచెంతఁ జేరి
చెలువు చిలుకఁగ ననె నాతిచేతి చిలుక. 135
సీ. నాతికీల్గొప్పున నల్లకల్వలు గావు
విరవాదిశరములో సరసిజాక్షు
నెలఁతనాసికయందు నీలంపుమణి గాదు
ముక్కరముత్యంబు మురవిఘాల
వనితపాలిండ్లపై వలచుకస్తురి గాదు
మలయజపంకంబు మదనజనక
తరుణినెమ్మేనఁ గదంబపుప్పొడి గాదు
వెలిదమ్మిపుప్పొడి విమలచరిత
తే. మరునిశరవహ్ని దరికొని మదిని బొదలి
వెలికి విసరంగ దాని లోపల నడంచి
యిదిగొ వచ్చెను బరితాప మడఁప ఘనుఁడ
వీ వటంచును రాధ యి దెంతధీర. 136

చ. జలరుహపత్రనేత్ర విను చందనగంధివిరాళి యెంతొ మై
నిలఁ గలపొష్షు లంగజునియింగలమందుఁ గరంగి పూదె లై
మిలమిల డొల్లి రాఁ జెలులు మిణురుబూచు లటంచుఁ బట్టి చే
తులు సెగ లంటి పొక్క వెతతో విదలింతురు మిట్టమీను లై.

తే. లేమకును నీవు పొత్తున లేనియట్టి
వాసరము లెల్ల శ్రీహరివాసరములు
మానినికి నీవు ప్రక్కను లేనియట్టి
రాతి రెల్లను మఱి శివరాత్రి యరయ. 138

క. కన లేదో విన లేదో
కనులార స్వీనులారఁ గాంతులు కాంతల్
ఘనవిరహాగ్నిని స్రుక్కఁగఁ
గన విన లే దిట్టివలపు కంజదళాక్షా. 139

క. అనిపలుకుచిలుకపలుకులు
వినువనజదళాక్షుఁ జేరి వేడ్కను రాధా
ఘనవేణి యిళను జూపుచుఁ
దనదగుప్రేమాతిశయము దనరఁగ నగుచున్. 140

సీ. చిగురాకుజిగి నూకు చెలియ కెమ్మోవికా
గజిబిజి మొనపంటిగంటు లెల్ల
ననచెండులను జెండు నాతిలేఁజనులకా
కఱకుగోటిపిరంగినఱుకు లెల్ల
సునునాచులను నేచు వనిత పెన్నెరులకా
కక్కసం బగు పెక్కు చిక్కు లెల్ల
మరువంపుగురి దింపు మగువ నెమ్మేనికా
విడువనిమరుసాముబడలి కెల్ల

తే. నకట మగలకుఁ దమయక్కలైనఁ జాలు
నబలలా గెంచి లాలించ రనుచు నిళకు
నగచుగతి రాధ తనలోనిపంతఁ దెలియఁ
జేసె శౌరికి నన్యాపదేశముగను. 141

చ. అది విని శౌరి రాధకర మల్లనఁ బట్టి బిరాన చేసరాల్ [గాఁ
గుదురుగఁ గంకణంబులును గూడఁగ ఘల్లుమటంచు మ్రోయఁ
గదియఁగఁ దీసిన న్గలికి కాంతుని పేరెద వ్రాలె నంతలో
గుదిగొను సిగ్గుచే నిళయు గొబ్బునఁ జాటున కేఁగె నవ్వుచున్.

తే. మాయురే బొబ్బ హాయిరే మజ్జు భళిరె
కలిసి విరిశయ్య మత్తేభములవితాన
నీడు లే దని వలపుల జోడు పొగడ
నపుడు వారిర్వు రాశయ్య నందుకొనిరి. 143

వ. ఇట్లు విడఁబడి. 144

సీ. కొసరుపల్కులఁ గ్రమ్మి గోటికత్తులఁ జిమ్మి
కాసెలోఁ జెయి వేసి కదియఁ దీసి
కన్నాత లాగించి కౌఁగిటఁ గదియించి
సరిబిత్తలల నెత్తి చనుల నొత్తి
యల్లందులకుఁ జొచ్చి కల్లమ్ములకు వచ్చి
మెఱుఁగుచెక్కిలి గొట్టి కురులు పట్టి
తొడకంబముల నాని తోపునూకుల నూని
పొందుచేసుక నొక్కి ముందు కెక్కి
తే. యదలుపులు కీలుగొట్లు నెయ్యంపులిట్లు
గళరవంబులు దుడుకులు చెలఁగ రాధ

నూధవుండును గడిదేరి మారుసాము
హాయిగాఁ జేసి సరిగెల్పు లంది రపుడు. 145

వ. అంత రాధాకృష్ణులు పరస్పరము సంభాషించి రది యెట్లనిన

సీ. మగడ యాపని దీటె మఱియొకయాటాడి
నాకును గట్టిగా న్యాయ మొసఁగి
పొలఁతి నీ పెందొడపుణ్యంబు నా కందె
లేఁతచిన్నది పట్టిరోఁత నాకు
నీకు దానికి నింత నేస్తమాయెను గృష్ణ
పొంతగా నినుఁ గూడి యింత బాగ
చెలియ నిమ్మళముగఁ జేసితివో లేక
యది చేసెనో నన్ను నడుగ వలదు

తే. బాగుబా గన గట్టిగాఁ బని యొసంగ
నియ్యరా కృష్ణ నాకును నిమ్ముగాను
శీవి వయసున గుణమున నీవె పెద్ద
వయము రయమునఁ గావింపు రతిని రాధ. 147

సీ. అధరామృతంబు నీ వానితివో కృష్ణ
యది లేఁజిగురువగ రంతె రాధ
కఠిన స్తనము లెట్టఁ గఱఁచితివో కృష్ణ
యవి లేఁతలికుచంబు లంతె రాధ
లలితోరు లూరుల మెలఁచితివో కృష్ణ
యవియనంటులత్వాక్కు లంతె రాధ
లీలాంగములు కౌఁగిలించితివో కృష్ణ
యవి ననలతకూన లంతె రాధ

తే. చతురసమరతిసుఖ మొనర్చితివొ కృష్ణ
నవసమాగమమున సౌఖ్య మవునె రాధ
యుపరతుల నిన్నుఁ గూడె నేమోయి కృష్ణ
యాచమత్కృతి ముగ్ధకెట్లబ్బు రాధ. 148

వ. ఆసమయమునందు. 149

సీ. కాలివాల్ పిట్టల కలకలంబులు మీఱెఁ
బగడకన్నలయొజ్జ బయలుదేఱె
నెలరాజు పశ్చిమాచలరాజముం జేరె
బలుచంద్రకాంతపు శిలలు పేరెఁ
దారకాగణముల తళుకు లెల్లెడఁ జాఱె
దీపంబు లెల్లను తెల్లఁబాఱె
నతనుఁడు రే యెల్ల ననిఁ జేసి వేసారె
ధర వియోగులపరితాప మాఱె

తే. దమ్ములలరారెఁ గలువలతావు దీఱెఁ
గోకములు తేఱెను జకోరకులము తాఱె
నినుఁడు గడిదేఱె నిరులు మొయిండ్లఁ దూఱెఁ
దెలివి చేకూఱె భల్లునఁ దెల్లవాఱె. 150

మ. యమునాతీరవిహార హారసదృశోద్యత్కీర్తిసంభార భా
రమణీయాకృతిమార మారసికతాప్రావీణ్యసంసార సా
రమరందోక్తివిచార చారణనుతప్రఖ్యాతవిస్తార తా
రమహీభృత్సమధీర ధీరమునివారాధార రాధారతా. 151

క. ధీరాళిమతోద్ధారా, ధారావర కృత్తమత్త దానవవారా
వారాశినిభగభీరా, భీరాహిత్యామరాద్రి విశ్రుతధీరా. 152

మాలిని. కలికలుషవిఘాలా కాంచనోద్భాసిచేలా
గళధృతవనమాలా కాంతరాధావిలోలా
బలభిదుపలనీలా పాండవత్రాణశీలా
తిలకితగుణజాలా దేవకీదేవిబాలా. 153

గద్యము. ఇది శ్రీచిన్నికృష్ణకరుణాకటాక్షవీక్షణాక్షుణ్ణప్రవర్ధమానానూనశృంగారరసప్రధాన సంగీతసాహిత్యభరతశాస్త్రాది విద్యాపారంగత శ్రీమత్తిరుమలతాతయాచార్యపాదారవింద మిళిందాయమానమానసచోళసింహాసనాధ్యక్షప్రతాపసింహ మహారాజ బహూకృతానేకచామీకరాంబరాభరణము త్యాగలుగర్భశుక్తిముక్తాయమాన ముద్దుపళని ప్రణీతంబైన రాధికాసాంత్వనం బను శృంగారప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# ద్వితీయాశ్వాసము



క. శ్రీరాధామధురాధర
సారామృతపానచతుర సద్గుణహారా
పారావారవిహారా
భారతసఖ చిన్నికృష్ణ పాలితకృష్ణా. 1

తే. అవధరింపుము దేవదివ్యానుభావ
వ్యాసమునిసూతి జనకభూవిభునిఁ జూచి
చొక్కటపు జీనిచక్కెర యుక్కెఱలకు
నెక్కుడై మించు నుడిచవు లెక్కఁ బలికె. 2

క. అటు లారాధిక గోపీ
విటు నటు రతికేళి నేలి విడువంగ నిలా
కుటిలాలకఁ జేరి తనదు
కుటిలత్వ మెఱుంగనీక కూరిమి చెలఁగన్. 3

తే. నిను మిగుల గాసి యిడె నని నే మురారి
నెనసి పైకొని దండింప నీవు నిదియె
సందుచేసుక యొచటికి జరిగి తనుచు
నిళను జేపట్టుకొని రాధ యింటి కేఁగె. 4

వ. అప్పుడు. 5

సీ. మహితగండస్థలీముకరికాపత్రికల్
మొసలివాపోగులపసలు దెలుప
మెఱుఁగుచన్నొనఁ గ్రమ్మి మెఱయుఘుమ్మనసంబు
పటుతరకౌస్తుభప్రభ ఘటిల్లఁ
దలిరువాతెర నొక్కు బలుకెంపు లలవేణు
వివరంపు నొక్కులవిధ మెసఁగ
నలిగి వెన్నునఁ గుల్కు తెలిముత్తెపుజడ
పన్నగతల్పంబు చెన్ను గనర
తే. హారగతి మణిశ్రీవత్ససార కాంతి
దశదిశల్ నిండ రాధికాతరుణితోడ
శౌరిసారూప్య మంది యిల్ చేర వచ్చు
నిశను గన్గొని యలివేణు లిట్టు లనిరి. 6
సీ. మనిసికాటున కెందు మందు లే దందురు
మంచిది ఘనసార ముంచరమ్మ
చిఱుగోటిపోటులు సెలవారు నందురు
పునుఁగుకుంకుమ గూర్చి పూయరమ్మ
తోడసాముచేఁ గండ లెడ గట్టు నందురు
చలువగొజ్జఁగినీట జవరరమ్మ
వలపుచెమ్మట లింకఁ జలి పట్టు నందురు
కలపంబు నెనయించి యలదరమ్మ
తే. కమ్మవిలుకాని యేనుఁగుగున్న బడలెఁ
దళుకుఁజెక్కుల సాంకవన్నెల ముంచి
యలరుమందులపొడిఁ బూసి యలుపుదీఱ
మేటితాంబూలకవళంబు మేపరమ్మ. 7

క. అని మిగులువగలఁ బల్కుచు
ఘనతరసురతాంతతాంతకాంతామణికిన్
మనసిజశాస్త్రక్రమమునఁ
దనువలయిక దీర్చి రంతఁ దద్దయు వేడ్కన్. 8

చ. అలరులమోవికాటు పస పంటినదుప్పటినీటు చెక్కులన్
విలసిలుతమ్మముద్దు జిగివెన్నునఁ గీల్జడదద్దు కన్నులన్
నెలకొనునిద్రసొక్కు మెడ నెక్కొనుగాజులనొక్కు లెంత
యున్, వెలయఁగఁ గేళిమందిరము వెల్వఁడె మన్మథమన్మథుం
డాగిన్. 9

తే. ఇటుల వెలువడి మజ్జనగృహముఁ జేరి
చలువగొజ్జంగినీటిచే జలక మాడి
వలువలు ధరించి కలపముల్ గలయఁ బూసి
యతివ వడ్డింప దివ్యాన్న మారగించి. 9

చ. పడఁతి యొకర్తు కెంపురవపావలు వెట్టు లతాంగి యోర్తు పా
వడఁ గొని వీవ నొక్కసుదవారణగామిని తావికప్రపున్
విడె మొసఁగన్ మఱొక్కనవనీరదవేణి కళాచిఁ బూనఁగా
నడిదము కేడెముం గొనుచు నంగన యొక్కతె వెంటఁ
గొల్వఁగన్. 11

సీ. మగరాలకంబాల నొగి యంత్రపాంచాలి
కలు మీటుపీఠెలగులుకు రాగ
ముల సొక్కి తల లూఁచు జిలుఁగుబంగరునీరు
వ్రాతచిత్తరుబొమ్మలను గుఱించి
యొరలెడు చిలుకల గొరవంకలను నవ్వ
నిలువిరినగవులో యివి యనఁ దగు

ము త్తియంబులతోఁ గె ముడికట్టుపనులహొం
బట్టు మేల్ కట్టుల వఱలు విరుల
సరులమూఁ గెడు తేంట్లగరుల మ్రోయి ళ్ళని
యాడునాఁడు నెమళ్ళ యడుగుటందె
తే. లందుఁ దగురొదరతినాద మనుచు నెపుడు
నిలువుటద్దాలపడకిళ్ళ నలరుగూండ్ల
రమణఁ బలికెడు పారావతముల నెపఁగు
రాధికామణి మణిసౌధరాజమునను. 12
తే. చేరి యట వింతపనులచేఁ జెలువు గులుకు
చలువచప్పరకోళ్ళమంచంబుమీఁది
యంచరెక్కలసెజ్జపై నలరుము త్తి
యంపులోడునఁ దగఁ జేరి హాసు మీఱి. 13
తే. అండ నటు నిల్చి యిళె ము త్తియంపుఁున్న
మిడినతమలపుటాకులమడుపు లియ్యఁ
గదిసి రాధిక తనచనుఁగవకుఁ బులక
లమరఁ జూచిన పాదపద్మముల నొత్త. 14
సీ. తంబుర మీటి గీతంబు పాడుచు నొక్క
మధురోష్ఠి సరిగమపధని యనఁగ
జగ్గుచౌకట్లను నుగ్గడింపుచు నొక్క
చక్కెరబొమ్మ తద్ధిక్కు మనఁగ
గుజరాతిజక్కిణీకోపు లాడుచు నొక్క
భామిని జీవుసల్లా మనంగ
బిరుదుకై వారము ల్పేర్మి సేయుచు నొక్క
సరసిజానన జయజయ యనంగఁ

తే. చంద్రబింబాస్య యొకతె పొచ్చరిక దెలుపఁ
జెలియ యొక్కతె సందడి దొలఁగఁజేయ
నందఱకు నన్నివగల నానంద మిడుచు
నిండుకొలు వుండె యదువంశమండనుండు. 15

చ. అపుడు పయఃపయోధిమణియల్లునిఁ బిల్వఁగ నెమ్మిఁ గోరి స
ద్విపులకులప్రదీపకుఁడు విశ్రుతకీర్తి యశోదతోడఁబు
ట్టపరిమితప్రభావజనకాధిపుమన్ననఁ గొన్న కుంభకుం
డుపగతహర్షుఁడై వరుస లొప్పఁగ వచ్చెను నందుచెంతకున్.

క. వచ్చినమఱఁదిని గని ముద
మెచ్చఁగ వడి లేచి కౌఁగిలిచ్చి సమానం
బచ్చుపడఁ బసిఁడిగద్దియ
నిచ్చి రహిన్నందుఁ డతని నీక్షించి దయన్. 17

ఉ. వచ్చినకార్య మే మనుచుఁ బల్కిన నాతఁడు కూఁతు నల్లునిన్
మచ్చికఁ బంపఁగా వలయు మాసదనంబున కన్న రాధతోఁ
జెచ్చెర నెచ్చరించి యటు చేయుదునం చని నందుఁ డాడఁగా
నచ్చెలియింటికిం జనె నిశాబ్జనళాక్షునిఁ గన్నతండ్రియున్.18

వ. ఇట్లు చనునెడ నాళీజనంబులవలనఁ దదాగమనం బాలకించి
యవ్విరించిగురుం డుదంచితముదం బెదం గదుర నెదుర్కొని
ప్రణమిల్లి యప్పల్లవతల్లజునిదీవనలం జెందిన వేడుకఁ దోడు
కొని తెచ్చి పొచ్చుపచ్చరాగద్దియ నుంచిన నతం డందు
వసించి రాధావధూరత్నంబుతోనం గుశలయించి యిళా
మాధవులఁ దోడ్కొని మానివాసంబునకు నీవు రావలయు
నన నావనజానన యయ్యా నన్నడుగం బని యేమి యయ్యి
శయు నేనును మీ కొక్కరూప కాదె నన్బిలువ వలయునే

వలసినప్పుడు వచ్చెద నిప్పు డిచ్చ్వధూవరులఁ బిలుచుకొని చనుండని పనిచిన వారలం దోడ్కొని నిజమనోరథం బీడేర రథం బారోహించి యాభీరవీరు లపారాయుధపాణు లై బలసి నలువంకలం గొలువ నమితానందంబును జెంది నందు మఱంది నిజమందిరంబునకుం జని సుఖం బుండె నంత నిచ్చట.

సీ. పద్మాక్షుఁడును దాను బవళించుపడకయి
ల్లని కను ల్కటికచీఁకటులు గ్రమ్మ
నెడలేక మురవైరి నెనయుముచ్చట లెంచి
పగిలి గుండియ వక్కావకలు గాఁగ
శ్రీకృష్ణుచేఁ గొనుచిలుకపల్కులు విని
గుమ్ముగు మ్మని చెవుల్ దిమ్ము గొనఁగ
హరిభోగ్యవస్తువు లందంద చోఁకిన
నెమ్మేను ఝుమ్మని సొమ్మసిల్ల
తే. నిప్పు డ్రొక్కినరీతిని నిలువ దెచట
గాము సోఁకినమాదిరిఁ గలువరించు
విఱిగి తల మిన్ను పడినట్లు విన్నవోవు
భావజానిఘాటి కలికి రాధావధూటి. 20

సీ. వెన్నెలచిచ్చులు వెదఁజల్లు రేరాజు
కిరణంపుగుంపుల సొరిగి సొరిగి
యమధనుష్టంకార మన మీాఱుతేఁటిఝుం
కారంబులకుఁ జాలఁ దారి తారి
రామాఘప్రూంత్కారంబులను మించి చనుదెంచు
మలయానిలునిఘాటి కళికి యళికి

యురుమనిపిడుగులై యొడలు చిల్లులు వోవఁ
బడుమరుకోలల బడలి బడలి

తే. వదరు చిలుకలకూఁతకు బెదరి బెదరి
పలుకుబకదారిపిట్టల కులికి యులికి
తల్లడిల్లుచు వడిఁ బడకిల్లు చేరి
మరులుకొని చాన తనదు నెమ్మనములోన.

వ. ఇట్లని వితర్కించె.

సీ. కలుగునా కన్నులకఱ వెల్లఁ దీఱంగఁ
గమలాక్షు నెమ్మోము గనుఁగొనంగ
వేవేగ నబ్బునా వీనులవిందుగా
దనుజారి వేణునాదము వినంగ
వలవడునా చేతు లతిపుణ్య మందంగ
వాసుదేవాంఘ్రి సేవలఁ బెనంగ
దొరకునా నెమ్మేను పరవశ మందంగ
వటపత్రశాయికౌఁగిట మెలంగ

తే. వొదవునా గోపగోపికాసదయు నెనసి
యురుతరానందజలరాశి నోలలాడఁ
బ్రబలమగు మద్దశాపరంపర ల వెట్లు
గాఁగ నున్నవో యేనైతె కాన నకట.

తే. రాసిఁ జేసిన శృంగారరస మనంగఁ
జతులకుఁ దోఁచు కరుణాతిశయ మనంగ
నొకటి యైనట్టి మన్మథాయుత మనంగఁ
బొలుచు గోపాలరూపంబుఁ బొగడవశమె.

క. *తమ్ములు శౌరిశ్రీపా
దమ్ములు మోదమ్ము లొదవఁ దమ్ముల నెల్లన్
దమ్ము లనం దప మళినా
దమ్ములు వేదమ్ములు నినదమ్ములు సలుపున్. 25

ఆ. పుంగవములమీఁదఁ బులులును బులులపైఁ
గరులుఁ గరులపైని హరులు గవియు
నందగోపసుతుని నడ కొకించుక సాటి
తాము తాము తాము తా మటంచు. 26

తే. దానవారాతి నఖధాళిధళ్యములును
బ్రపదరోచులు పదరుచుల్ పరిఢవిల్లె
నతనియడుగుల నొకటిగా నతిశయిల్లు
జాహ్నవీయమునాసరస్వతు లనంగ. 27

తే. తీర్థపాదుని శ్రీపాదతీర్థమందుఁ
గలకమఠనక్రములు దేలి వెలికి వచ్చె
జోడుజోడుగ నన నీడు జోడు లేక
యతనిమీఁగాళ్లఁ జీలుదోడ లనువుమీఱు. 28

చ. సిరియును భూమినీళలును జెల్వగువల్లవపల్లవాధరల్
నిరతము లాలనల్ సలుప నిగ్గులు గుల్కెడు శౌరిజంఘలన్
గరకరిఁ జూచి మారజయకాహళు లూఁదఁబడంగ నేమగున్
మొఱ లిడు టింతె కాని సరిపోలునె పోలిన బోలుఁ జెందవే.

క. నాగారిగళముపైఁ దగు
నాగమదధ్వంసితొడలు నాగకరంబుల్
నాఁ గనుకని నగరే యొల
నాగలతో ధీరు లైన నాగరజనముల్. 30

ఆ. కౌస్తుభంబుతోడఁ గనుపట్టుఫణిరాజ
శాయిగళము శంఖ మాయె ననుచుఁ
గనకపటముతోడఁ దనరుగోపాలక
స్వామికటియుగంబు చక్ర మయ్యె. 31

తే. జానులను జేరుబాహులసరవిఁ జూచి
కనులు చెవులకు వివరింపఁ గదియువింత
పోలుపు వినఁగోరి తల లెత్తె భుజములటులఁ
గానలే నైతి ననువంతఁ గౌను చిక్కె. 32

తే. ముజ్జగంబులు వెన్నుని బొజ్జ నున్న
తెఱఁగు వివరించుదారి నాఁ ద్రివళు లమరుఁ
గదిసి వళిభంగములఁ దేలుకమల మనఁగ
నలువగుము లీనుకృష్ణునినాభి దనరు. 33

ఆ. శ్రీయుతంబు గాఁగఁ జెలువరాపడగయు
గందపట్టె లుండుకతనఁ దలుపు
హరియురంబు నెపెరి శిరము వే వ్రక్కలై
మూలయింటిలోన మూఁతపడియె. 34

క. కనుపసికాఁపు పడంతుల
చనుజక్కువ లలరఁ జేయు శౌరినఖంబుల్
చనునే నెలరేఖలునా
ననుపమములు తత్సుచుంబు లవియే జగతిన్. 35

చ. ఖరముపరకంసహంసనరకాదిసురారుల ప్రాణవాయువుల్
పొరిగొని దివ్యరత్నమయముద్రిక లొప్పెడి సోగవ్రేళ్ళతో
హరిభుజకాండముల్ చెలువ మందు శిరోమణు లందమందఁ

గా, మురువగు పంచభోగయుతభోగుల నీఁగను శ్రీ
లోసంగుచున్. ౩౬

చ. శరణనువారికి న్మృదువు శత్రులకు న్గఠినత్వ మిచ్చుఁ ద
న్మెఱుఁగని వీనిపల్లవములే మెన యంచుఁ దలంచె నంచుఁగా
మురువగు దేవశాఖిని సమూలముగాఁ బెకలించి తెచ్చి యా
మురరిపుకేలుదోయి యిడె ము న్నొకభామ పెరంటిచెట్టుగన్.

ఉ. కోరినఁ గల్పశాఖి యొకకొన్ని ఫలంబుల నిచ్చు నల్పముల్
కోరిక పార నిత్యఫలకోటుల నిచ్చు మురారిబాహువుల్
సారెకు వాని వీని కెటు సాటి యనం దగు దీటు లేమిచే
వారక పోల్తు రీకవులు వానికి వీనికిఁ దాఱుమాఱుగన్. 38

చ. అరయఁగ శంఖచక్రముల నంది సుగంధములం భరించి ప
ల్మరు విను చిక్కినట్టిమహిమన్ ఘనసింధుసేవ్యమాన మై
ధరణిధరత్వ మంద గిరి తద్భుజయుగ్మముమీఁద నెంతయున్
సరిపడఁ బోరి యెత్తు వడె చాలక యామురవైరిచేత నే. 39

చ. సరసులు మెచ్చఁగాఁ దనరుశంఖ మనంతము పద్మయుగ్మమున్
నుహారికంఠమధ్యనయనంబులకు న్వెలగా వటన్నచో
వరయఁగఁ బోకలా పిడికిలా యొకచేర లటంచు నెంచఁగన్
హారిహారి వారిమూఢమతి కాదియు నంతము గల్గఁ నేర్చునే.

తే. మారు దధిరామృతం బెందు జాఱనీక
కోరి పెట్టిన నీలంపుఁగోర యనఁగ
గొల్లచెలియలసొమ్ముగాఁ గొనుచుఁ దనరు
మదనజనకుని చుబుకంబు మధుర మొదవు. 41

తే. కావి గా దది పిడికెంపువీవి గాని
దీవి గా దది యమృతంపుబావి గాని

బావి గా దది కపురంపుతావి గాని
తావి గా దది శౌరికెమ్మోవి గాని. 42

క. తేటలుగా జిగిముత్యపు
పేటలుగాఁ బంచదారపేటులుగాఁ బూఁ
బోఁటలుగా రాచిలుకల
మాటలుగాఁ గంసవైరిమాటలు దనరున్. 43

తే. శౌరిముఖచంద్రునకు సహజంబు లగుచుఁ
దగియె నధరామృతస్ఫూర్తిమృగమదాంక
మతులితకటాక్షశీతల మైనకళలు
నవ్వువెన్నెల కువలయానందగరిమ. 44

ఉ. మల్లెలు మొల్లమొగ్గలును మంకెనపువ్వు సువర్ణకోశముల్
దెల్లనినవ్వు పల్వరుస తియ్యనివాతెర నిక్కుముక్కు నై
యల్లుకొన న్ముఖాబ్జమున నాతఁడు మాధవుఁ డౌ టెఱింగి మే
ల్చెల్లనె వీనికి న్బుధులు చెప్పెడి యాసుమనోభిధానముల్.

చ. మురహరునాస నూఁదఁబడి పోయిన నీలపువేణునాదముల్
సరి గన లేక చేఁబడిన చంపకకాండవిలాసపంపదల్
నెరి గని కాదె పక్షిపతి నేర్పున ము క్కొడఁ జేసి తగ్గి త
చ్చరణములందు క్రిందుపడె సమ్మతినెప్పుడు వీఁపుఁ జూపుచున్.

క. సరి లేనిశౌరినాసిక
స్మరవనవంశంబు గాదె మఱి దానితుదల్
వరముక్తాఫల మేటికి
వెర వగుతిలపుష్పతుహినబిందుపురీతిన్. 47

క. అద్దిర నిద్దపుటద్దము
లద్దనుజవిదారిచెక్కు లటు గా కున్నన్

సుద్దపుటుద్భుతరసమున
కొద్దిక నైయె చూచువారి నొగి లోఁ గొనునే. 48

చ. జలజము కల్వ లొక్కడెస శౌరివిశాలవిలోచనంబులం
దుల గనఁ గోరి హంసతతితో జలమందుఁ దపంబు సల్పఁగాఁ
గలిగెను దోసము న్బగలుఁ గ్రమ్మఱ నాకనుదోయి నెంచఁగాఁ
జెలఁగెఁ బికస్వరం బమర శ్రీధరణీకరభూషణంబులై. 49

క. మురహరునివంకబొమ్మలు
మరువిండ్లే కాక యున్న మగువలమనముల్
మెఱుఁ గైనచూపుతూపులఁ
గురిసి విభేదించువారి గొనునే జగతిన్. 50

తే. తనుఁ దలఁచి దీను లిడు మొఱల్వినఁగ లేక
యతులనవదివ్యసంపద లలరఁ జెలఁగు
శౌరివీనులు శ్రీలె పో సారె కటులఁ
గాక కనుదమ్ములటు మేలు గనఁగ నేల. 51

తే. శౌరిముఖసామ్యమును గోరి సారసారి
గట్టుపై నెక్కి తలక్రిందు గాఁగ నెంతొ
కాఁకఁబడిపడి తనచేతఁ గాక కాదె
యతనుచిత్తానువర్తి యై యతిశయిల్లె. 52

చ.వలనగునబ్జరూపములఁ బాత్రము జ్యోతియుఁ గాఁగఁ జేసియ
వ్వలపులతేనితండ్రి మొగవానికి వాసిగ దృష్టి దీసినం
జెలిమిఁ ఘటిల్లనప్పు డొక చెల్వము గాంచి ఘనంబు మించి హం
సలకుఁ గలంగకే యుభయసంపద లందెఁ దమఃప్రసక్తిగాన్.

తే. ఇరుల గా వవి నీలంపుసరులు గాని
సరులు గా వవి మగతేఁటిగఱులు గాని

గులు గా వవి మరువేఁటయురులు గాని
యురులు గా వవి శౌరిముంగురులు గాని. 54

సీ. ఈకప్పుపెన్నెరి కేన యౌనె పౌరముల్
నీలాంచలముపైని నెగడినంత
నీయొమ్మెక్రొమ్ముడి కేన యౌనె నునునాచు
యమునాజలంబులో నల్లినంత
నీనిడుకీల్జడ కేన యౌనె రాహువు
గురుతమోవిఖ్యాతిఁ గొన్నయంత
నీగొప్పకొప్పున కేన యౌనె శిఖికోటి
ఘనులతో బహుమైత్రిఁ గన్నయంత

తే. ననఁగ వలగట్టి మృదులత్వమంది చిక్కఁ
గొనక భంగ మై కొనసాగి కనుల కెసఁగి
బెండుపడకయె యెపు డొక్కదండి వన్నెఁ
జెందుగోపాలకస్వామిచికురభరము. 55

సీ. శకటారినెమ్మోముసరి యెందు లే దని
ద్విజరాజుపై నానఁ బెట్ట వచ్చు
శౌరికన్నులతోడ సమ మెందు లే దని
తమ్ములఁ బడవైచి దాఁట వచ్చు
మరునికన్నమమోవిసరి యెందు లే దని
యమృతంబుముందర నాడ వచ్చుఁ
గ్రీడిబావయురంబుజో డెందు లే దని
యాదిశేషునిఫణా మంట వచ్చు

తే కంసరిపుమధ్యసామ్యంబు గలుగ దనుచుఁ
జెప్పి హరిముందరనె బాససేయ వచ్చుఁ

కృష్ణదేవునిరూప మిం కెందు దొరకఁ
బో గటంచును నజు నైన ముట్ట వచ్చు. 56

క. ఇల రాయరాయ లగు మా
యలరాయల నెంచి యాచ కాచక మదిలో
నలరాయల నెలరాయల
వలరాయల నెన్న దృష్టిపాత్రలు గారే. 57

ఉ. ఆనడ లామెఱుంగుతోడ లారసికత్వము లావిలాస మా
మేనిమెఱుంగు లా మొలకమీసపురంగులు నా బెడంగు లా
సూనశరాసతంత్రపరిశోధన లామధురస్మితంబు లా
పూనిక చొప్పు లాపలుకుపోడిమి యానెఱజాణకే తగున్.

ఉ. మాటలు ముద్దుపద్దులును మక్కువ టెక్కులు మ్రొక్కు సొక్కు
లున్, గాటపుకౌఁగిలింతలు వగల్ గిలిగింతల మీటువింతలున్
మాటికి మాటికి న్దలయు మాలిమి మేలిమిఁ జూచినట్టి యే
మాటది వాని వీడు నకటా కడు రక్కసి నన్నుఁ దక్కఁగన్.

మ. అని చింతించుచు మించుఁబోఁడి తనకున్ బ్రాణావనోదారమై
వనజస్యందమరందబిందువిలసద్వ్యాఘ్రోరణీసార మై
యనవద్యాఖిలలోకవర్ణితమనోజ్ఞాకార మాకీరముం
గని తా నిట్లనె సూనసాయకశరాఘాతార్తచిత్తాబ్జ యై. 60

మ. ఇదిగో వచ్చెద నంచుఁ బోయె బహునాళ్లేఁగెన్ మహాబ్దం
బులై, సదయుం డేటికి రాఁడు నాయెడఁ గటాక్షం బెల్లఁబో
నాడెనో, మదిఁ దా వీడెనో కూడెనో యిళను రామా జీవ మూ
టాడెడిన్, మదనక్రూరదవానలంబదనమై మైనంటఁగాఁగీరమా.

ఉ. కంటికి నిద్ర రాదు విను కాంతుని బాసిననాఁటినుండియున్
వంటక మింపు గాదు పెరవార్తలు వీనుల సోఁక లేదు నేఁ

డొంటిగఁ బ్రొద్దు పోదు మరు లూరక యుండఁగ నీదు తో
ల్లియ్యేజంటఁ బెనంగువారిఁ గనఁజాలక చాల కరంగఁగంటినో.

సీ. వానిమోమును జూచి నే నేల మరు లైతి
జిగిచందమామపై వెగటు దోఁప
వానిమైసొగ సెంచి నే నేల వలచితిఁ
గలువలపాన్పుపై గసటు వొడమ
వానినవ్వు దలంచి నే నేల చిక్కితిఁ
జిక్కనిపాలపైఁ జేఁదు గొనఁగ
వానిమా టాలించి నే నేల లో నైతిఁ
జిలుకపల్కులపైని జొల్కు నమర

తే. వానివా తెర నే నేల యానఁ గంటి
జీనిచక్కెరయుక్కెఱలేని మాన
నిందు కేమందు నేమందు నంది తిందు
నెపుడు హరిపొందు గనుఁగొందు నెట్టు లుందు. 63

సీ. కనుగవ హరిమోము గనుఁగొననే కోరు
వీనులు హరిమాట వినఁగఁ గోరు
నాసిక హరిమేని వాసన ల్గొనఁ గోరు
నధరంబు హరిమోవి యానఁ గోరు
జెక్కిలి హరిగోటినొక్కుటెక్కులె కోరు
గుబ్బలుహరిఱొమ్ముఁ గ్రుమ్మఁ గోరుఁ
గరములు హరి నెంతొ కౌఁగిలింపఁగఁ గోరు
మేను శ్రీహరిప్రక్క మెలఁగఁ గోరు

తే. నిన్నియొక్కొకటే కోరు నిదిగొ నాదు
మనసు గోరెడికోరికెల్ మట్టులేవు

మర్మ మెందుకు మదనసామ్రాజ్య మిచ్చి
నెగడుహరియె యాయుర్దాయ మగుట శుకము. 64

మనసు కరఁగును హరిముద్దుమాట విన్న
మోహ మెద నిండు హరినగుమోము గన్నఁ
దమి చెలంగును హరిచెంత నిమిష మున్న
మఱవ వచ్చునె యెవ రెంత మఱవ మనిన. 65

హరిపేరురముఁ జూచినంతఁ జన్గుబ్బలు
సిగ్గుమాలుచు రైక చిటుల నుబ్బుఁ
బసిగాపురాయలపల్కు విన్నంతనే
వీనుల కమృతంబు విందు లగును
మీనాంకుతండ్రి నెమ్మేను సోఁకినయంతఁ
బులకలు తను వెల్ల మొలక లెత్తుఁ
గమలాయతాక్షుని గదిసి పైకొన్నంతఁ
దమి నిండి తండోపతండ మగును

తే. నందనందను డబ్బెనా నవనిధాన
ములును దక్కినచందానఁ జెలఁగుఁ జిత్త
మామనోహరుఁ బాసి నేఁ డడల వ్రాసె
నౌర తలవ్రాఁత తలకొట్లమారిధాత. 66

క. చెలువుని గన్గొనుటకు నా
పలుకునఁ జని చిక్కనేమొ పరిపరిగతులన్
బిలిచిన రా దిచ్చటికిం
జెలిమి గలుగునాదుమనసుచెలి యోచిలుకా. 67

క. వీడుదు బంధుల మగనిన్
వీడుదు ధనధాన్యగేహవిభవము లెల్లన్

వీడుదుఁ బ్రాణము లోడలఁ
వీడంగాఁ జాల హరిని వే యన నేలా. 69

ఉ. ఎంతని విన్నవింతు హృదయేశుఁ డొనర్చినవింత లన్నియుం
జింత కెడంబు లాయె మును చేసినబాసలు దప్పు లాయె న
న్నింతులు నవ్వ నాయె వెత లెందు వెలి న్విడఁ గూడ దాయె
నే నెంతయుఁ దారనాయె నిఁక నేటికి మాటలు ముద్దుకీరమా.

క. కలగంటి నిన్న రాతిరి
కలకంఠిని గూడి హరికిఁ గరకరి నాపైఁ
గల కంటినగతి నిదిగో
కలకంఠధ్వనులు కర్ణకాండము లయ్యెన్. 70

ఉ. కావునఁ బోయి నీ విపుడు గావుము శౌరిని దెచ్చి కూర్చి వే
గావుగ నన్ను వేగడిసి కాయజుఁ డెంతయుఁ బంతగించె లో
జీవము లావలించెఁ దమి సిగ్గు నడంచె విరాళి మించె మై
దీవె చలించె దాయ యయి దేవుఁడు నన్నిటువుంచెఁ గీరమా.

సీ. నాకృష్ణదేవుని నాముద్దుసామిని
నాచక్కనయ్యను నాదుహరిని
నానోముపంటను నారాజతిలకుని
నారాముతమ్ముని నాదువిభుని
నామనఃకాంతుని నానందతనయుని
నాప్రాణనాథుని నాదుప్రియుని
నామోహనాంగుని నానీలవర్ణుని
నావిటోత్తంసుని నాదుసఖుని

తే. జేర్చి కన్నులకఱవెల్లఁ దీరఁ గాంచి
చాల నడగితి మ్రొక్కితిఁ గేలు సాఁచి

కౌఁగిలించితిఁ గరములు కనులఁ జేర్చు
కొంటి రక్షింటి మది వేడుకొంటి ననుమి. 72

సీ. మోహనాంగునితియ్యమోవి బింబ మటంచు
మదిఁ జొక్కి నామాట మఱవ వలదు
నలినలోచనుని లేనగ వానవా లంచు
మరులెక్కి నామాట మఱవ వలదు
కంసారిపలుకులు కండచక్కెర లంచు
మదిఁ దక్కి నామాట మఱవ వలదు
రమణుచల్లనిచూపు లమృతపూర మటంచు
నెఱిఁ జిక్కి నామాట మఱవ వలదు
కమలాక్షుకరములు కల్పశాఖ లటంచు
మది నెంచి నామాట మఱవ వలదు

తే. వానిఁ గనిరేని ఘనమోహవనధిలోన
మరగి మున్గుదు రయ్యాదిమాను లైనఁ
బలుక నేటికి మనవంటివారిఁ గానఁ
గీరమా తెల్వి గొని తెల్పు శౌరితోడ. 73

క. ఇళ చెంత నాథుఁ డుండఁగ
బలుకం బోయెదవు నాదుపలుకులు చిలుకా
వెలి దీసి యొంటికొలువున
జెలువునితో విన్నపంబు సేయుము చిలుకా. 74

క. అనుచిలుకలకొలికిని గని
కనికరమునఁ జిలుక పలికెఁ గలికిరొ వినుమా
వనరుహనయనుఁడు మఱి మది
నిను గడ నిడి భళి మఱొక్కనెలఁతను గొనునా. 75

సీ. కలికి నీకంఠంబుకరణి నున్న దటంచు
నీకటితటిదారి నెగడె నంచుఁ
గాంత నీయూరులగతిఁ జెలంగె నటంచు
నీయూరుతీరున నెగడె ననుచుఁ
జాన నీబొమలచందాన మించె నటంచు
నీముక్కు టెక్కున నెగడె ననుచుఁ
బోలఁతి నీకొప్పుచొప్పున మేలు గనె నంచు
నీమోముగోమున నెగడె ననుచు
తే. శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గములను
వేణుశిఖిపింఛపద్మము ల్వీడక పూనె
నట్టిహరి నిన్ను విడుచునా యడల వలదు
నిమిషమునఁ దెత్తు నే వాని నీలవేణి. 76
క. జలజభవాదులచేతం
దెలివిగఁ దే రానివానిఁ దే నోపుదువే
భళిభళి నీ వనఁ దెత్తును
బలుసోదరు నీకటాక్షబలమునఁ జెలియా. 77
క. అని పలికి కలికిపంపునఁ
జనె ముద్దులుచిలుకు చిలుక జలజదళాక్షుం
గొని వత్తు నంచు నంతట
వనిత సఖు ల్గొలువఁ గేళివనమున కరిగెన్. 78
తే. కొమ్మ యీరీతిఁ జని కొమ్మకొమ్మయందు
నూతనం బగు దళములు నూల్కొనంగ
మరునికోటగు పూఁదోఁటఁ జేర వెఱవఁగఁ
జొరవ నుడివిరి తెఱవలు మఱువు పడఁగ. 79

చ. సకియరో చూడుమా కనులు చల్లఁగ నల్లదె మాధవుండు వా
రక సుమనోవికాసుఁ డయి ప్రాప్తవనప్రియచిద్విలాసుఁ డై
శుకముఖ సద్ద్విజప్రకరసూనృతవాఙ్మయుఁ డౌచు గోపికల్
కకవికఁ జొట్లఁ బెట్ట వనలక్ష్మిని గూడి చెలంగె వేడుకన్. 80

చ. పొగడలు చెంగలించె సురపొన్నలుక్రొన్ననలుంచె మావులం
జిగురులు మించె సంపెఁగలు చెల్వు వహించె రసాలసాలము
ల్మొగడలు నించె గొజ్జఁగిగము ల్వికసించె నశోకభూజము
ల్తొగరు ఘటించె మించెఁ గదళుల్ కనవే ఘనవేణి కామిణీ.

చ. ఘనకమలాకరాశ్రయతఁ గాంచినహంసలు మాధవస్తుతిం
జను పికముల్ హరిం దలఁచు జక్కవపక్షులు కృష్ణవర్ణముల్
గొను నును దేఁట్లు మారగురుఁ గోరి వహించుశుకంబు లొప్పు
మేల్గని పురుషోత్తమస్ఫురణఁ గైకొనె నీవనిఁ జూడుభామినీ.

క. ఇటు లాడుచెలులమాటలు
కుటిలాలక యాలకించి కొంతకుఁ గొంతక
దిట మూని కేళివనముకు
జటులగతిం జొచ్చి మెల్లఁ జని చని యచటన్. 83

సీ. పున్నాగములఁ జూచి పున్నాగము లటంచు
భ్రమగొని లేమావిగుములఁ జేరు
లేమావిగుములను లేమావిగుము లంచుఁ
దారాడి స్యందనతతికిఁ బాఱు
స్యందనతతులను స్యందనతతు లని
వెత నొంది పరవీరతతులఁ గోరుఁ
బరవీరతతులను బరవీరతతు లంచు
బెదరి కెంజిగురాకుపొదలు దూఱుఁ

తే. బోదలు మదనునివిరియంపపోదు లటంచు
నవలగొజ్జఁగినీటికాలువలఁ దారుఁ
జెలులపైఁ జీరు వేమారు కలఁకఁబాఱు
వెతలచే మీఱు వేసారు విధిని దూఱు. 84

క. ఈరీతి నెచట నిలువక
తారాడుచు నొకరసాలతలమూలమునన్
జేరి విరిపాన్పుమీఁదను
నారీరత్నములు గొలువ నవలా చెలఁగెన్. 85

తే. కోకకుచ కాఁకఁబడఁ జూడ లేక లోక
బాంధవుం డస్తమించెను బశ్చిమాద్రిఁ
గువలయద్వేషి యయ్యును గొమ్మవంతఁ
గనఁగ లేఁ డన నితరుల ననఁగ నేల. 86

సీ. మఱి సంజ గనిపించె విరహులపై వల
రాజు గ్రక్కినకోపరస మనంగఁ
దిమిరంబు తిమిరించెఁ దెగిపాంథులను ముంచ
మరుఁడు నిర్మించినమాయ యనఁగఁ
దారక లరుదెంచె మారుండు పథికులఁ
గూల్ప నించిన చిచ్చుగుం డ్లనంగ
విధుబింబ ముదయించె వెస వియోగులనొంప
స్మరవీరుఁ డెత్తినచక్ర మనఁగ

తే. కొండుమల్లియతండముల్ పూచినటులఁ
బండువెన్నెల బ్రహ్మాండభాండ మెల్ల
మెండుకొనె విప్రయోగులమీఁద శంబ
రారి వైచిన వెలిగుడారం బనంగ. 87

ఉ. కలువలు విచ్చె నీరరుహకాండము మోడ్చె జకోరపంక్తు
న్నెలరుచి గ్రోలె జక్కవలనీటులు దీఱె విటీవిటాళిపే
రలుకలు జాఱె సూనశరుఁ డమ్ములు నూఱె సుధాంశురాలలో
పల జల మూరె దంపతులబంధురతాపము లాఱె నంతటన్.

చ. వెడవిలుకాఁడు లోపలను వెల్వల గాలియుఁ బైని జంద్రుఁడుఁ
జడిగొని చుట్టుఁ గీరములు శారికలు న్పికహంసముల్ నెఱా
యిడుములఁబెట్టఁగాఁ గలికి యిట్టటు బెట్టుగఁగొట్టుకాడుచుఁ
బడలి విరాళిచేఁ గుముదబంధుని గన్గొని సైఁచ కిట్లనున్. 89

ఉ. తోయధిరాజుకుం బొడమి తోయజవాసినితోడఁ బుట్టి యా
తోయరుహాప్తుజం టగుచు తోయజనేత్రునకు న్మఱంది వై
త్రోయఁగ రానిచీకటులఁ ద్రోయుచుఁ జల్లని తెల్వి చెందియుఁ
నాయమె నీకుఁ జెంగలువనాయఁడ నాయెడ నింత సేయఁగన్.

తే. కాలమహిషాధిరూఢతఁ గగలి వచ్చి
కిరణపాశమ్ములఁ దగిల్చి విరహిజనుల
డాసి దీసెదు ప్రాణముల్ దోసకారి
రాజవా నీవు యమధర్మరాజు గాని. 91

క. తమ్ములకును గొడుకునకును
సమ్మతి గానట్టిరజనిచరుఁడవు గావా
యిమ్మహి రావణదితిజుల
నమ్మక్కరో మించి తౌర యత్రికుమారా. 92

తే. గురుసతిని బట్టి విప్రయోగులను గొట్టి
తమ్ముల నడంచి పక్షపాతము ఘటించి
కాలగతి నుండి యిదె రాజగట్టునుండి
పడె దధోగతి రౌరవప్రాప్తిఁ జెంది. 93

చ. తనుఁ గొనువారినిం గొనుచు ధర్మముదప్పక కాలకూటముగా
మును గళమం దడంచికొని మూర్ఖత నిన్నిరసావహింపఁగాఁ
బునుకకళాస మెమ్ములను బూదియుఁ బూని తలేఱుఁ బట్టి పే
నును సగమయ్యుమూలఁ బడె నుగ్రుఁ డుదగ్ర నిశాచరాగ్రణీ.
వ. అని మదనునిం గూర్చి యిట్లనియె. 95
తే. విసముతోఁ బుట్టెఁ గావున విధున కకట
పద్మినుల నేచుగతి సరే భళిర నీవు
పద్మినీపద్మనేత్రులవలనఁ బుట్టి
మేనమామను బోలఁగా మేలె మదన. 96
తే. తల్లిపుట్టింటిపగవానిఁ దనరఁ జేసి
తండ్రి పేరును గైకొన్న దంట నంటి
పద్మినీజాతులను జంపఁ బగలు గంటి
వౌర నీ కిది యేమిటి మేర మార. 97
చ. అని యనిలుంగురించి పవనాపవ నాయెడఁజేమ నాయమా
ఘున మెడలించి మారుగతిఁ గైకొనుచు న్నుమనోహరుండవై
దినమును లంకనుండి చను దెంచుచుఁ గొమ్మలఁ బల్మిఁ బట్టఁగా
ననఁ దగు దీవు రావణున కన్నవొ తమ్ముఁడవో యెఱుంగరా.
వ. అని శుకపికాదులఁ గురించి. 99
సీ. కాని మాటనె బందిఖాననే వేయింతు
గడుసుకొక్కెర వేఁటకానిఁ గూడి
పట్టి మీపు ట్రెల్లఁ బలుగాకుల కొసంగి
వేమింతు గోపికారాముఁ గూడి
పద మెత్తి పెట్టి మీమద మెల్ల వదలింతు
మెదలనీయక నీలమేఘుఁ గూడి

జడకొద్దిఁ గొట్టి పిఱాఁ చెఱుగంతుల నడంతు
నిస్తులశరదబ్జనేత్రుఁ గూడి

తే. యలిగి మొగ మేల నెఱఁజేయ శుకములార
విడువుఁడీ వట్టికూఁతలు పికములార
డించుఁ డటు మందగతుల రాయంచలార
నిలుపుఁ డిఁక వెఱ్ఱికేకలు నెమ్ములార. 100

వ. అని విలపించుచుండు నవసరంబున. 101

చ. చిలుకపజీరుఁ డత్తఱిని జిందఱవందఱఁ జేతు నంచు నా
చిలుకలకొల్కి పైఁ గదిసి చివ్వలిరవ్వ లడంగ జాతిపెం
జిలుకులకోరికోల లటుచేఁదెను దుమ్మెదనారి మ్రోయఁగాఁ
గలికిమెఱుంగుగుబ్బలను ఖంగు ఖణీలు ఖచిక్కు రింగనన్.

క. ఇ ట్లేసిన మది ఝల్లని
పట్లెల్లను సడలి రాధ భయ మందుచుఁ దా
ని ట్లని పలుకఁ దొడంగెను
బొట్లంబుగఁ జుట్లు నున్న పొలఁతులతోడన్. 103

ఉ. శౌరిని బిల్వఁగాఁ జనిన చక్కనికీర మదేల రాదొ యే
దారినిఁ జన్నదో నడుమఁ దారెనొ చేరెనొ లేదొ గోపికా
జారునిఁ గాంచెనో కనదొ చక్కఁగ నావెత విన్నవించెనో
సారెకు లేక శౌరినుడిచక్కెరయుక్కఱ మెక్కి చిక్కెనో.

సీ. పద్మాక్షుఁ డెవ్వతెపైఁ గన్ను వేసెనో
పలుమాఱు పలకన్ను పదరె నిదిగొ
శౌరి యెవ్వతెమోవి చవులకు మరగెనో
వదలక కెమ్మోవి యదరె నిదిగొ

వనజారి యచట నెవ్వతెచెట్టఁ బట్టెనో
విడువక భుజము కంపించె నిదిగో
ఫణిశాయి యెవతెను బైకొని యేలెనో
మించి పెందొడ చంచలించె నిదిగో
తే. చిత్తజునితండ్రి యెవతెచేఁ జిక్కుకొనెనో
మించుసంచున మై తత్తఱించె నిదిగో
చిలుక యీవేళకును రాక నిలిచినపుడె
యేమి హేతువో తెలియ లేదింతులార. 105

క. చెలువుఁడు వేఱొక చెలియను
దలఁపునఁ దలపోసినపుడె తనకుం దానే
తల నొచ్చుఁ గనక వినకయె
కలికిరో యే మందు వలపు కానిది సుమ్మీ. 106

చ. కిలకిల నవ్వుచుం దివిరి కిన్నెర మీటుచుఁ బాట పాడుచున్
జిలుగురుమాలచెంగు వెనుజీరగఁ దుప్ప టొకింత జాఱఁగాఁ
గళుకుహొరంగు పెండియము ఘల్లన నాయొడలెల్ల ఝల్లనన్
దులదుల శౌరి వచ్చుగతిదోఁచియుఁదోఁచకయున్న దేమొకో.

సీ. మదహస్తిపై నెక్కి మావటీల్ గొలువంగ
విచ్చలవిడిఁ జొచ్చి వచ్చునటుల
సాంబ్రాణితేజిపై సాహిణు ల్వొగడంగఁ
బట్టాను జేపట్టి వచ్చునటుల
వెంట దళంబులై విచ్చుకత్తులవారు
మెచ్చఁగా దులదుల వచ్చునటుల
గిలుకుపావలు మెట్టి చెలికాండ్రు వెంట రాఁ
బావురంబును బూని వచ్చునటుల

తే. పడఁతు లిరువంకఁ దెలనాకు మడుపు లొసఁగఁ
గొనుచు జిగిచూపులను నాదు మనసు గొనుచుఁ
బడకయిలు సేరఁగా శౌరి వచ్చునటుల
దోఁచుటే కాని మఱి యేమి దోఁచ లేదు. 108

చ. ఉరమున హారము ల్గదల నొం ట్లసియాడ రుమాలచెంగు వె
న్నొరసి నటింపఁగాఁ జెమటలూరఁగఁ గస్తురిబొట్టు జాఱఁగా
వరుసలు మీఱఁగా గళరవం బొఱపారఁగ మందనుండి శ్రీ
హరి నను నేలె నేను నెదురానఁగ మాయగ నున్న దేమొకో.

చ. అరయఁగఁ బ్రాణనాయకుల నవ్వుల నివ్వలఁ బాయురామలా
విరిశరునంపతంపరల వ్రేఁగునఁ బొర్లఁగ న్యాయ మక్కటా
హరి యిదొ నాదులో వెలి నహర్నిశముం గనుపట్టుచుండెడిఁ
విరహ మిదేలనో మిగుల వేదనఁ బెట్టెదు రాగతంబుగన్. 110

చ. వలచినవారు లేరొ యెడఁ బాసినవారలు లేరొ వారలీ
యలమటఁ జెందిరే మిగుల నందియు నావలె జీవయుక్తలై
నిలిచిరె యేటిమాట లివి నేరక యాడితి భూమి నుండఁగాఁ
గలిగెను శౌరితోఁ జెలిమి గంధగజేంద్ర సమానగామినీ. 111

ఉ. ఎంతవిలాస మెంత సొగ సెంత వదాన్యత యెంత రాజసం
బెంత యొయార మెంత కళ యెంత గభీరత యెంత సోయగం
బెంత నిరూఢ మెంత నయ మెంత మనోజ్ఞత యెంత శీవి నా
యంతటిమందభాగ్య కిఁక నంతటిచక్కని దేవుఁ డబ్బునే. 112

సీ. నేను ముద్దులు వెట్టఁ దాను ముద్దులు వెట్టి
తెఱవ నీదుఋణంబు దీరె ననును
నేను గెమ్మోవానఁ దాను గెమ్మోవాని
వెలఁదిరో యిందుకు విందె యనును

నేను జెక్కిలి నొక్కఁ దాను జెక్కిలి నొక్కి
విరిబోణి వీడుకు వీడె యనును
నేను గౌఁగిటఁ జేర్పఁ దాను గౌఁగిటఁ జేర్చి
మెలఁతరో మేరకు మేర యనును

తే. రతుల నే నేలఁ దా సమ రతుల నేలి
సారసాక్షిరో యిది మారుబేర మనును
చిన్నిచిన్నారి వెన్నుఁడు సేయుచిన్నె
లెన్ని యౌ న్నని తలపోతు నేమి సేతు.

సీ. కెమ్మోవి యానకు గేలి సేయుదు రంటె
గజిబిజి మొనపంట గంటి సేతుఁ
గురులు పట్టెద్వఁకు గుట్టు దక్క దటంటె
చీకాకుగాఁ దీసి చిక్కుపఱచు
జిగిగుబ్బ లంటకు సిగ్గు పోవు నటంటె
క్రొత్తనెత్తురు గ్రమ్మ గోరు లుంచుఁ
బరులు రాఁగలరు లే వడిగ నేలు మటంటె
జాములతరబళ్లఁ బ్రేమ నేలుఁ

తే. బలుక వల్లనఁ బావురా పలుకు పలుకుఁ
గిలకిలను నవ్వవ ల్లనఁ గేక వేయు
వానివగ లెంచి మైసీరు గానియపుడె
రాతఁ జేసెనో చెనటి విధాత నన్ను.

సీ. వానికన్నులతేట వానిచల్లనిమాట
వాఁడాడుసయ్యాట వానిపాట
వానిముద్దుమొగంబు వానికంబుగళంబు
వానిబొమ్ముధిటంబు వానిడంబు

వానివాతెరతావి వానిపెన్నెరితావి
వానిచక్కనితీవి వానియావి
వానిమూఁపులపొంగు వానిమేనిమెఱుంగు
వానికౌనుబెడంగు వానిరంగు
తే. వానియొరతీరుచూపులు వానిసొరు
వానివలపులదొరసాము, వానిగోము
వానిసేఁతలతగుమేల్మి వానితాల్మి
పరుల కెవ్వరికిని లేదు మఱవు రాదు. 115

సీ. తనరఁ జూచిన దృష్టి దాఁకునో యని వాని
నునుమోము కనులారఁ గనఁగ నైతిఁ
గదియ నొక్కిన నేడఁ గందునో యని వాని
యధరంబు తనివార నాన నైతి
బిగిగుబ్బ లెద సోఁక బొగులునో యని వాని
రొమ్మున నిండారఁ గ్రుమ్మ నైతిఁ
దడవు చేసిన మేను బడలునో యని వానిఁ
జెట్టఁగి నామనసారఁ గలియ నైతి
తే. నొచ్చు నం చని చెక్కిలి నొక్కనైతి
నలుగు నని క్రుచ్చి కౌఁగిట నలమ నైతి
నందసుతుప్రేమ సత మని నమ్మి యుంటి
నిప్పు డీరీతి నడుచు నం చెఱుఁగ నైతి. 116

సీ. మును చల్ది లొసఁగుచు మోమోటమున నున్న
సోముఁడు సోముఁ డై చుఱుకు చూపె
నపరశరీరుఁ డై యాత్మజుఁ డై యున్న
మారుఁడే మారుఁ డై పోర సాగె

దాక్షిణ్యశాలి యై తగు ప్రాణ మై యున్న
గాలియే గాలి యై కలఁప సోఁకె
మధువు గూరుచువేళ మహిమ నపేక్షించు
సురభియే సురభి యై తలుమఁ జూచె
తే. నగ్నిశిఖ లయ్యె వివరింప నగ్నిశిఖలు
భువి శిలీముఖములు శిలీముఖము లయ్యె
నన్ని యట్లయ్యె నిక్కైన యపుడె యిపుడు
కృష్ణదేవునిదయ దప్పె నేమి సేతు. 117
వ. ఇట్లగుటం జేసి. 118
సీ. తగుకుంకుమరసంబు మగనిపేరురమునఁ
బెం పొందుకొమ్మ కర్పించరమ్మ
పదనైన గంబురా సదయువాతెర నాని
యొసఁగు రంభోరున కొసఁగరమ్మ
నూటినకస్తూరి గారాబుపతి ప్రక్క
వెలయుమృగాక్షి కి ప్పించరమ్మ
చేర్చి కూర్చిన విరుల్ చెలికానిఁ బైకొని
పొసఁగు లతాతన్వి కొసఁగరమ్మ
తే. కటకటా నేర కిటు లంటిఁ గాని ద్రోహి
నైన నేఁ గూడఁగాఁ బెట్టి నట్టిదీని
నిచ్చినంతనె వారల మచ్చికలకు
హాని పుట్టదె యిప్పుడే చానలార. 119
వ. అని యనేకవిధంబుల విలపించు సమయంబున. 120
తే. హరునుదుటికంటిమంటలనంటి బెదరి
త్రుళ్ళి రాతును బడ వైచి మళ్ళి వచ్చు

తియ్యవిలుకానిసాంబ్రాణి తేజి యనఁగ
గగనమార్గంబునను దోఁచెఁ గలికిచిలుక. 121

క. ఇటు లేతెంచినచిలుకను
కుటిలాలక చూచి లేచి కులుకుచుఁ జిలుకా
యిటు రమ్ము రమ్మటంచన
దిటముగ ముంజేత వ్రాలె దీనత దోఁపన్. 122

తే. అటుల ముంజేతిపై వ్రాలినట్టిముద్దు
చిలుకను గుఱించి చిలుకలకొలికి పలికె
మోవి కంపింప ముక్కరముత్తె మదరఁ
గప్పురపుతావి గుప్పున నుప్పతిల్ల. 123

సీ. కంటివా నాసామికళలుగుల్కెడుమోము
కనులకఱవు దీర గరిమ చేర
వింటివా నాసామి వెలలేనిపలుకులు
తమకంబు దైవాఱఁ దాప మాఱ
నుంటివా నాసామి యొఱపైనముంజేతఁ
గాయంబు చెలువాఱ ఘనత మీఱ
మంటివా నాసామి మన్ననల్ గైకొని
బలుసంతసము దేర వలపు లూర

తే. నంటివా తుంటవిలుదంటమంటమారి
తనము తొలగంటి వెనువెంటఁ దగిలె నంట
తొంటి నెనరంట నొంటి నే నింట నుంట
జంట గూడక తాళ లేనంట చిలుక. 124

ఉ. దేవకిచిన్నికుఱ్ఱ వసుదేవునికూన యశోదపట్టి నా
దేవుని నెందుఁ గందు బలదేవునితమ్ముఁడు గోపగోపికా

జీవనజీవనంబు యదుసింహుఁడు శౌరి కిరీటి బావ శ్రీ
దేవియనుంగు సౌఖ్యనిరతి న్వసియించుఁగఁ గంటె కీరమా.

తే. ఎంతవేఁడిన బదులాడ వేమి చిలుక
కాలగతు లెట్టు లున్నవో గడచివామె
కాఁగలది కాక మానదు గాన చెప్పు
చల్లకై వచ్చి ముంత దాచంగ నేల. 126

తే. అనిన విని చిల్క యుల్కి పేరల్క చిల్కఁ
బల్కె నిట్లని చిల్కలకొల్కితోడ
నన్నదలమిన్న విను మొన్న నన్ను నీవు
వనజనాభుని దోడితె మ్మనఁగఁ బోయి. 127

క. తెలివా యే మని చెప్పుదు
హరి యున్నవనంబు చేరి యటు చూతుఁగదా
గిలికొని యున్నా రచ్చటఁ
దరుణులు కోటానకోట్లు తన్మధ్యమునన్. 128

సీ. బారను గొల్లగా మీఁలువక్షమువాఁడు
తలచుట్టి వచ్చునేత్రములవాఁడు
చిక్కనిపాల్గారు చెక్కులు గలవాఁడు
మెఱుఁగు చామనచాయ మేనివాఁడు
విడికెంపునణఁగింపు బింబాధరమ్మువాఁ
డున్నతాజాను బాహువులవాఁడు
చిగురాకులను గేరి నగుపాదములవాఁడు
డంబైనకంబుకంఠంబువాఁడు

తే. నెమలిరెక్కతురాఁబూనునెరులవాఁడు
మొలకనవ్వులఁదగుముద్దుమొగమువాఁడు

మదనకోటులఁ గొనగోట నదుమువాఁడు
చారుతరమూర్తి గోపాలచక్రవర్తి. 129

తే. పూలసిగ పీడ బావిలీల్ తూలి యాడ
రాజసము గూడ భూషణరాజితోడఁ
బ్రోడలకుఁ బ్రోడ యని కొనియాడి పాడఁ
గనఁదగియెనాఁడఁ గన్నులకఱవు లూడ. 130

తే. మనము మాటాడ వేళ గా దనుచు నేను
దియ్యమామిడికొమ్మపైఁ గుయ్యి కణఁగి
యుంటి దంటల మటుమాయతలటు లెఱుఁగ
సరగఁ గులుకుచు వారలు హరిని గూడి. 131

సీ. కొమ్మయొక్కతె గబ్బిగుబ్బలు గదియించె
సకియ యొక్కతె మోవి చప్పరించె
వనితయొక్కతె రాధవలె నేలు మనితక్కెఁ
చెలియ యొక్కతె నిక్కి చెక్కు నొక్కె
రమణియొక్కతె పావురాపల్కులను బల్కెఁ
గలికియొక్కతె పొలయలుక చిలికె
నలివేణియొక్కతె సొలపిముద్దులు వెట్టె
సువిదయొక్కతె పాదయుగము పట్టె

తే. ముదిత యొక్కతె చుంబనంబునను బొల్చె
బాల యొక్కతె పుంభావకేళి నిలిచెఁ
జానయొక్కతె సమరతిసలుపఁ బిలిచెఁ
దరుణియొక్కతె నటనబంధనము సలచె. 132

చ. అపు డొకకుల్కులాఁడి పొలయల్కలు చిల్కుచుఁ బల్కు
పల్కుకొన్, గపురపుపల్కు లొల్కు వగకాఁడ బలే నిను

మెచ్చఁగావలెఁ, గపటము చేసి మాచెలిని గంతునిరంతుల
కొప్పగించి నీవిపు డిటు వచ్చి నెచ్చెలులవేడుకల న్మరఁగంగఁ
జెల్లునే. 133

తే. అనుచుఁ జనుదేరఁ గని యిళావనితచెలియ
యందు మది నెంచి చెలులకేడించి దాని
గబ్బిచనుదోయి యెద నుంచి కౌఁగిలించి
పడఁతితోఁ దెల్ప వల దని పంజరించి. 134

సీ. తప్పక తనుఁ జూచి తెప్పవేయక వచ్చు
జలజాక్షిపై దృష్టిసైత మిడక
మోహోపదేశతమోముఁ జూపుచు వచ్చు
సకియమోమున ముద్దుసైత మిడక
బహుదూరమున నుండి పైఁట విచ్చుచు వచ్చు
చానగుబ్బల గోరుసైత మిడక
భ్రమఁ బోకముడి సగ్గి బారవైచుక వచ్చు
నాతిమేనున మేనుసైత మిడక

తే. జారుశిఖపీడ తెలిము త్తైసరము లాడ
నందియలు పల్కఁ బఱచెఘుర్ఘాంబు లొలుక
నదరు మదినాటి యిళ నెంచి యదుకిరీటి
పదక మెన మీఱ బంగారుపటము జాఱ. 135

మ. ఇటు లేతెంచినశౌరిరాకఁ గని యయ్యేణాక్షిమోహంబుచే
నటు చన్గుబ్బలు లుబ్బఁ గన్ను బెళుకఁ బారాళు లల్లాడ నా
మటుమాయ ల్గలశౌరిఁ జేరి పులకల్ మైఁ గ్రమ్మఁగాఁ గ్రుచ్చి
కౌఁగిట శయ్యాగృహమందుఁ జేర్చి మదనక్రీడాభిలాషం
దగన్. 136

క. అప్పుడు వారలవెంటనె
చొప్పెఱుఁగఁగనీక నందుఁ జొరఁబడి యొకహా
న్నెప్పులకీల్బొమ్మకడఁ
దప్పక కనుచుంటి వారిసేటమటలెల్లన్. 137

సీ. పన్నీరుమేరువల్ బాగాలతట్టలు
కలపంపుగిన్నెలు గందపొడులు
ముడిపూలపొట్లముల్ పునుఁగుకరాటముల్
జవ్వాదిబరిణె లాకూరసంబు
సొమ్ములపెట్టెలు సొరిది యత్తరుబుడ్లు
కుంకుమపింగాండ్లు కుసుమధృతులు
కపురంపుఁగ్రోవులు కస్తూరివీణెలు
కట్టువస్త్రంబులు చుట్టుఁ దనరు
తే. చలువచప్పరకోళ్ల మంచంబులోనఁ
జెంపబిళ్ళలతలగడల్ చిన్నిదిండ్లు
బటువులొరగులు గలపూలపాన్పుమీఁదఁ
దమకమున నిళామాధవుల్ తగ వసించి. 138

సీ. కంసారి బిగియారఁ గౌఁగిటఁ జేర్చిన
గుబ్బలకసి దీరఁ గ్రుమ్మెఁ గొమ్మ
కంజాక్షుఁ డాని చిక్కనిముద్దువెట్టిన
నలరుచక్కనిమోవియానెఁ జాన
యతనునికన్నయ్య యచ్చోటఁ జెనకినఁ
దేటచెక్కిలి గోటమీటె బోటి
మందరనగధారిమణితముల్ నించినఁ
జిగురుమకారముల్ చిలికెఁ గలికి

తే. కృష్ణదేవుఁడు కరికరక్రీడ సలుపఁ
జేరి తమి రేచి పురికొల్పెఁ గీరవాణి
నీలవర్ణుఁడు పైకొని క్రీడ నేల
బాలి నెదురొత్తు లిచ్చె నిళాలతాంగి. 139

సీ. కిలకిలనవ్వులు గిలిగింతలును బంధ
భేదపురవములు వింతవగలు
పావురాపలుకులు వాతెరనొక్కులు
చిగురుమకారముల్ జిలుఁగుఁబిట్లు
మరుసుపై సరములు తొందరముద్దులు
బిగికౌఁగిలింతలు బింకములును
గోనగోటిమీటులు గోరింపు లుబుకులు
కొసరులు బొమముళ్ళు కుఱుచసన్న

తే. లౌర శాబాసు మేలు బళారె బాగు
హాయి తడఁబడ కెడ గాకు మాయెనాయె
విడకు విడువకు మనిగొడి నుడువు లపుడు
చెల్లవో యేమి చెప్పుదుఁ గొల్లకొల్ల. 140

తే. వెలఁది యీరీతి వేవేలవితము లమరఁ
గలిసి కసివోక నీలమేఘంబుమీఁద
నెరితళుక్కనుక్రొక్కాఱుమెఱు పనంగ
సరసిజాక్షునిపై వేగఁ జొకళించె. 141

సీ. వడగండ్లగమిగుంపువర్షించుఘన మనఁ
గుసుమముల్ గురియుకీల్గొప్పు మెఱయ
హిమబిందుసిక్తమై యింపొందుతమ్మి నాఁ
జెమట గ్రమ్మినమేను చెలువు మీఱఁ

చిలుక నొక్కినబింబఫలరాజమో యన
మొనపంటిగంటికెమ్మోవి దనర
డాగు వేసినబల్కడానికుండలరీతిఁ
గొనగోటిమీటుల గుబ్బ లలర

తే. మారసంగ్రామగంభీర భేరిదారి
రవలబంగారుటందెలరవ మెసంగఁ
దరుణి పొదలుచుఁ బురుషాయితంబు సలిపె
ముద్దులమురారిపై లకుముకి యనంగ. 142

చ. తనుకులు మూల్గు లగ్గలికతాఁకులు సోఁకులు తోఁపు
లూపులుఁ, గొసరులు మెప్పులుఁ వగలు గుల్కులు
బెళ్కులు కూర్మిపల్కులుఁ, వెసఁ జిఱునవ్వులుఁ వలపు
నిక్కులు తక్కులు సొక్కుమ్రొక్కులుఁ, గుసగుసమాట
లు న్నడిచెఁ గూరిమి నిద్దఱికి న్సమంబుగన్. 143

క. నానావిభవాకరమై
మానససంజాతజాతమహిమార్ణవమై
కానుకతరమై యాసుఖ
మానందబ్రహ్మమైనహరి మైమఱచెన్. 144

గుణితమత్తేభవిక్రీడితవృత్తము.

తరుణీమన్మథ తామసాంతతిమిరోద్యచ్ఛాఘను తీర్థాంఘ్రిపు
ష్కరమాతూర్ణగవైనతేయహయతేజస్సార్యశైత్యోజ్జ్వల
ద్వరచక్రాయుధ తోయజాతనయనా తౌషారశుభ్రప్రభా
కరకీర్తిప్రద తంద్రికేతరచిరాఖ్యా తస్కరాగ్రేసరా. 145

కవిరాజవిరాజితము.

వృజినవితారణకారణ దారుణవీర్యగుణాగుణవిత్ ప్రతిభా
విజయవిస్ఫురత్వరజిత్వరసత్వరవీర పరాత్పరవిప్రసభా
నిజపదసేవనపావనభావననిలఘునాఘుననిర్మలభా
స్వజనకృతాదర మోదనసాదర సర్వధరాధరసారశుభా. 146

క. అంభోధిపటీభారవి, జృంభణసకలాద్రికులవిశృంఖలదళహృ
జ్జంభారితనయసారథి, గాంభీర్యౌదార్యవిజితకలశాంబునిధీ.

గద్యము. ఇది శ్రీచిన్నికృష్ణకరుణాకటాక్షవీక్షణాక్షణప్రవర్ధ
మానానూనశృంగారరసప్రధాన సంగీతసాహిత్యభరత
శాస్త్రాదివిద్యాపారంగత శ్రీమత్తిరుమలతాతయాచార్య
పాదారవింద భృంగాయమానమానసచోళసింహాసనా
ధ్యక్ష ప్రతాపసింహమహారాజ బహూకృతానేక
చామీకరాంబరాభరణ ముత్యాలుగర్భశుక్తిముక్తాయ
మాన ముద్దుపళనిప్రణీతం బైనరాధికాసాంత్వనం బను
శృంగార ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# తృ తీ యా శ్వా స ము



క. శ్రీమహిళా ప్రియనాయక
సామజరాజాపవర్గసంధాయక భ
క్తామితకామితదాయక
భూమిప్రియ చిన్నికృష్ణ పోషితకృష్ణా. 1

తే. అవధరింపుము దేవ దివ్యానుభావ
వ్యాసమునిసూతి జనకభూవిభునిఁ జూచి
చొక్కటపుజీనిచక్కెరయుక్కెఱలకు
లెక్క యైమించునుడిచవు లెక్కఁ బలికె. 2

చ. అపుడు చెలంగి పొంగి యిళ హాసికతో విడివడ్డరేకతోఁ
గపురపుఁదావివీడియము ఘుమ్మని క్రమ్ముముఖాంబుజంబుతో
గపురపుటారజంబుగమకంబు నయంబు భయంబుఁ జూపుచున్
విపులతర స్తనాగ్రముల వెన్నునిఱొమ్మునఁ గ్రుమ్మి నెమ్మి
తోన్. 3

చ. పరవశుఁ డైనశౌరిఁ గని పంకజలోచన రాధికామణిం
దొరఁగు మటంచు వేఁడుకొనెఁ ద్రోయక మాధవుఁ డిచ్చె
నమ్మికల్, పురుషుల కేటిసత్యములు పూనికలే డవి నమ్మకేది నీ
మరు లిటు కొండలై పెరుగుమాత్రమె కాని కురంగ
లోచనా. 4

వ. అనిన విని ఘనాఘనవిస్వనంబు విన్న చిన్ని రాయంచ చందం
బున గబ్బిబెబ్బులిమ్రోత లాకర్ణించిన కన్నెసారంగంబు తెఱం
గున బిడాలఘోషంబాలకించినబాలశుకంబురకంబున సింహ
నాదం బాలకించి బెగడినపెంటియేనుంగు తెఱంగున బెగ్గ
డిల్లి యాపాదమస్తకంబునుం జల్లుమని పులకలు మొలక
లెత్త గుండె గభిలనగ నకావకలై తల్లడిల్ల డిల్లవడి
యారామకారునిచే ఖండితం బయిన కదళికాకాండంబుచం
దంబున నందనందనుని పైఁ జెందినవలపు నిలుపోపం జాలక
చాల కరంగి జాలిమాలి నేలవ్రాలి మూర్ఛిల్లిన న్గనుంగొని
చెంగట మెలంగు మెఱుంగుబోణు లెలుంగు దిగులన నమ్మక
చెల్ల యీహల్లకపాణి నింక నమ్మఁగఁ జెల్ల దను నుల్లసంబున
నల్లసిల్లుచు నవ్వల్లవపల్లవాధర నెత్తి యొత్తుపయ్యెద
చెఱంగుల స్వేదబిందుసందోహంబులం బోనొత్తి చల్లనిపటీర
నీరపూరంబు చల్లి నల్లకల్వరేకులు తుదల నల్లిబిల్లిగాఁ గను
పట్టు వట్టివేళ్ళవీవనలు విసరి కెందమ్మిదళంబులం గట్టిన
కపురంపుపొట్లమ్ములం గర్ణంబులం గీలించి శైత్యోపచారం
బుల నేరఁ దేర్చఁ బెద్దయుం బ్రొద్దునకు ముకుళితంబు లగు
కనుదమ్ములు విచ్చి పదాహతిఁ బొరలునురగాంగనభంగి బుస
కొట్టుచుఁ గటతటంబు లుబుక ముక్కుపుటము లదర
రాకానిశాకరబింబంబుడంబును విడంబించునెమ్మొగంబు జేవు
రింపఁ బ్రచండమారుతతండంబునం దవిలి వడంకు కెందలి
రాకువీఁక బింబాధరంబు కంపింప మరుఁ దురువడి నొరవెరికి
విరహాలయుఁబంబులు దూసిపోవం గ్రుమ్మి తనీయరక్తంబు
లంటఁజేసి ధళధళరఘుళిపించు తళుకుకత్తులజిత్తులం బెట్టుచుఁ

గ్రొత్తలత్తుక జొత్తిల్లమ త్రిల్లు బిత్తరపుఁజూపులు కడకన్నులం గ్రమ్మరింప డగ్గరి పొగ్గడికత్తియలు బెగ్గడిల్లి యవలి నివలఁ దొలంగి నిలువ సాకారం బగుశోకంబురీతి సాకాత్క రించినకోపంబుభాతి సశరీరం బగుబడలికకై వడిం గనుపట్టుచుఁ గలికి చిలుకం దిలకించి క్రోధమూర్ఛిత యై కొంతతడవూర కుండి పిండియుఁ దెలివి దెచ్చుకొని బెట్టునిట్టూర్పులు నిగుడించి గద్గదస్వరంబున ని ట్లనియె. 5

ఏమేమీ వెంపింత లేకయె యిళాహేమాంగి యిట్లాడెనే యామాట ల్విని మంచి దం చనియెనే యాధూర్తగోపా లుఁడుక, రామా యట్లనె కాని మంచిపని రారా వేల యేమా యె నా, భామారత్నముఁ గూడి తా సుఖము మై వర్ధిల్లినం జాలదే. 6

మఱచెనో నాచేతిమణితంబు లన్నియుఁ
బలుక నేర్చిన నాటిపంజరింపు
తెలియదో నాచేతిదేశ్యంపు గుజరాతి
విత మెఱింగిననాఁటివేడుకోళ్లు
ఎంచదో నాచేత నిల జంత్ర గాత్రంబు
లభ్యసించిననాఁటియణకు లెల్ల
వేఁడదో నాచేత వెడవిల్తుశాస్త్రంబు
లెఱుఁగఁ బూనిననాఁటి తిరుగుమరుగు
గణన సేయదో మరుసాము గమనములకుఁ
దాను నాచేతఁబడినబెత్తంపు పెట్లు
పసులు గని కేరి నవ్వ దబ్బర మురారి
లాలనకె పొంగి యిప్పు డిళాలతాంగి. 7

తే. నిన్నఁ గుప్పయు నేఁ డాళ్లు నెలఁత తాను
గోరి నామీఁదఁ జేసెనే కారుబారు
ముక్కుపచ్చలు మాసక మునుపె బిరుదు
పిచ్చుక యెదిర్చి కాట్లాడ వచ్చినటుల.

తే. వెనుకఁ గొప్పాను ముందఱఁ జనులుఁ గ్రేణి
సేయునాయెడ నాచెంతఁ జేయు వింత
తాను బెంచినపొట్టేలు తనదుచేన
సన్నఁబడుసామ్య మాయెనో చిన్నిచిలుక.

తే. తనదు మ ట్టెంత తా నెంత తానె యింత
చేయఁజూచిన నే నెంత సేయరాదు
వేలు వాచిన ఱోలంతవిరివి యైన
ఱోలు వాచిన నది యెంత బోలు గాదు ?

తే. వారిజాక్షుని నాపగ వారివెంట
ననుప గోరంత యైనను మనసు లేదు
నందుఁ డనుపఁగఁ గని మనమందు నందు
కొంటి తడ సేయరా దని యుంటిఁగాని.

ఆ. కుట్టఁదేలు కుట్ట కున్నఁ గుమ్మరబూచి
తోసిరాజటంచుఁ జేసి చెలియ
దానివేలు దీసి దానికణ్ణ పొడిచిన
యటులఁ జేయఁకున్న నగునె చిలుక.

ఆ. తగరు కొండమీఁదఁ దాఁకఁ గోరినదారి
నెదురు దన్నుఁదెలియ కింత పలికె
నెంతమీసు వచ్చి యెంతమీసును బ్రింగెఁ
గాన: ద్రుళ్లునెద్దె గంత మోయు.

సీ. ఆశుకవిత్వంబు లల్లి తేనే సరా
చిత్ర ప్రబంధము ల్సేయ వలదె
గోటిచేతను వీణె మీటితేనే సరా
కొంచక రా ల్గరఁగించ వలదె
పదచాళిరాగము ల్పాడితేనే సరా
హిత వొప్పు వర్ణంబు లెత్త వలదె
అలనాట్యభేదమ్ము లాడితేనే సరా
నవరసంబుల నంటి నడువ వలదె
తే. వింతవింతగఁ గలసినయంత సరియె
యెమ్మెకాని మనోభావ మెఱుఁగ వలదె
యేమి నేరని నిన్నటి యింత మొటికె
నన్ను విడనాడనా కోరెఁ జిన్నిచిలుక. 14
తే. కాని పదరకు మిఁకమీఁద దానిమోము
గనఁగ వల దని శౌరిని గట్టిపెట్టి
బింకములు కూల నరకాలఁబెట్టి నేల
రాచకున్నను నాపేరు రాధ గాదు. 15
క. అన విని శుక మి ట్లనియెను
వనితా యే మందు దానివగలో త్రుళ్లో
మినుకో తెలివో గెలివో
విను వెన్నకుఁ బండ్లు వచ్చు విత మాయెఁ గదే. 16
తే. చూపులోపల నొకవింత చూపుతళుకు
నడుపులోపల నొకవింత నడుపుబెళుకు
నుండు నునికికి నొకవింత నుండుకులుకు
వచ్చెఁగదవమ్మ మనయిళావనిత కిపుడు. 17

తే. లేనిపట్టింపు లెల్లను బూని చాన
నేనె యెదు రైన నింతైనఁ గాని చూడ
దల్పునకుఁ గల్మి వచ్చిన నర్ధరాత్రి
గొడుగు లెమ్మన్నకతగాను కోమలాంగి. 18
తే. పడఁతి మును దెల్పనా పదింబదిగ నేను
దానివినయంపుపోకిళ్లు తగ నెఱింగి
మానిసిని జేయ వలదమ్మ దీనిఁ జేర్చి
తెలియ నిది మేకవన్నియపులి యటంచు. 19
వ. అనిన మధురవాణి యను మధుపవేణి యవ్వీరిబోణి నవలో
కించి యి ట్లనియె. 20
క. ని న్నెఱుఁగడు త న్నెఱుఁగదు
తన్నుం దనమట్టెఱుంగు దామోదరుఁడే
తన్నుండె నిన్ను విడుచు న
టన్న న్నఁటే దీని నగరె హాహా జనముల్. 21
క. ని న్నుండే మానిసిగాఁ
నిన్నే వెలి సేయఁ బూనె నెలఁత భళారే
కొన్నంగడిలోపలనే
యన్నన్నా మాఱుబేర మగునే చెలియా. 22
ఆ. ఈఁక తోఁక లేని శ్రీకృష్ణుమాటలు
పొలఁతి నమ్మి నానఁబోసికొనియెఁ
దగిలెనా తగులును దప్పెనా తప్పును
నాతి వెఱ్ఱివానిచేతిరాయి. 23
తే. కుమ్మరికిఁ జూడ నొకయేడు గుదియ కొక్క
పెట్టటన్నట్టు దీనియొబ్బెట్టుతనము

లెల్ల నిదె తీరు నొకసారి యిటకు శౌరి
వచ్చి ని న్నేల నిందుకు వగవ నేల. 24

వ. అనిన విని రాధావధూరత్నం బి ట్లనియె. 25

తే. కోటిమదనులఁ గడ వ్రేలిగోట గెలుచు
సుందరాకృతితోడ నానంద మిచ్చు
దివ్యచందనగోపాలదేవుఁ జూచి
వసుధలోఁపల వలవనివారు గలరె. 26

తే. దాని నెంతయు నన నేల తలఁచి చూడఁ
దప్పుతంటలకోఱగాని దానవారి
ననవలెను గాని తెగ నిండ దోసకుఁ దీసి
యేయువాఁ డేయ న శ్మెమి సేయుఁ జిలుక. 27

ఆ. నందసుతుఁడు మున్ను నామీఁది ప్రేమచే
నొకటి సేయఁబోయి యొకటి సేయ
అత్తనెత్తిఁ జేతు లంగడిలోఁ గన్న
లాయె ననుచుఁ జెలియ లౌనసి నవ్వ. 28

వ. అని మఱియు నారాధావధూటి తనచేటీరత్నంబున
కి ట్లనియె. 29

ఆ. తగులుదాఁకను మేళ మగపడ్డఁ దాళముల్
గాఁగఁ జేసినట్టి కాంత వింత
గట్టు చేరినంతఁ బుట్టివానికి బోష్మ
గట్టు పామ్య మాయెఁ గదవె చెలియ. 30

సీ. శీరవాణులచేతఁ గిల్లాకు లంపితే
శిరసావహించు నోసరసిజాక్షి
నాతి యెవ్వతెయైన నామేర వేఁడితే

కను లెఱ్ఱఁజేయు నోకంబుకంఠి
యెలమి నాకోసర మెంతవారల నైనఁ
దెగనాడఁ దలఁచు నోచిగురుఁబోఁడి
యేఁ జూచి చూడక యేమాటఁ జెప్పిన
జవదాఁట వెఱచు నోసన్నుతాంగి

తే. యేపదార్థంబులైన నాయెదుటఁబెట్టి
కెవరికి నొసంగఁబోవఁ డో యిందువదన
చేరి యటు లున్నవిభుఁ డిట్లు చేసెనేని
తిరుగ బ్రతుకాడవలెనఁటే శరదవేణి. 31

క. ఘనమ్మింతో చన వొప్పఁగ
మన్నించినవిభుఁడు వెనుక మార్గాగ మైనన్
గన్నియ బలిమిని వేడుక
విన్నదనం బడియె కాదె విధుబింబాస్యా. 32

సీ. మేను మే నానిన మేను సోఁక దటంచుఁ
గలపంబు లొల్లఁ డోకలువకంటి
పరులువచ్చిన రిత్తపలుక నయ్యో యనని
తెరయొత్త నియ్యఁ డోశరదవేణి
అలమి కౌఁగిటఁ జేర్చ నడ్డ మయ్యో యనని
హారంబు లొల్లఁ డోహంసగమన
గాసిల్లినాతోడల్ కండె లయ్యో యనని
పుంభావ మొల్లఁ డోపువ్వుఁబోఁడి

తే. మణిగుణంబులదారిని ననఁగి పెనఁగి
కుసుమగంధంబులట్టులఁ గూడి మాడి

చెలఁగి తిలతైలములరీతిఁ గలసి మెలసి
యున్నవిభుఁ డెట్లు చేసె నోసన్నుతాంగి. 33

క. అల్లునిమంచితనంబును
గొల్లనిరసికతయు లేదు కోరితి నీ రెం
డల్లనె చూచియుఁ గనియును
బల్లములోఁ బడినదాని భంగిని జెలియా. 34

క. నెఱతన ముడి గింటింటికిఁ
దిరుగుచు బతిమాలు వారికిఁ దెఱవలు కఱవా
తిరిపెం బెత్తెడువానికిఁ
బెరుగుంగా డేమిబ్రాఁతి విధుబింబముఖి. 35

క. కలలో నైనను బాయక
కలకాలము నున్నవిభుఁడె కసుగాయకు నై
పలచన చేసె నటన్నం
జెలియా మగవారిచనవు చెడ్డది సుమ్మీ. 36

క. అనువనజాక్షిని గని తాఁ
గనికరమునఁ జిలుక పలికెఁ గానీ వమ్మా
వనజాక్షువింత లెఱుఁగవె
కని తెల్పిన భారతంబు కత లై పెరుఁగున్. 37

సీ. కొనగోళ్ళఁ గొని దాని ననమోవి చెనకితే
కసుగందునో యంచుఁ గలవరించు
మొనవేళ్ళ మెలమెల్లఁ జనుమొనల్ నిమిరితే
తగిలి నొచ్చునో యంచుఁ దత్తఱించు
వదన మించుక నాభి పై మోపి ముద్దాడి
బరువాయెనో యంచుఁ బలవరించు

గోటిచేఁ గప్పుముంగురులు చిక్కుడలించి
చుఱుకునేమో యంచుఁ బరితపించు

తే. జాజిపూఁదేనె గొనుతేఁటి జాడ నమరి
తాను రతి చేసి దానిపాదమ్ము లొత్తు
వలచువారును వలపించువారు లేరొ
వార లీబూమె లొనరింపలేరు గాని. 38

తే. దొరకరానిపదార్థంబు దొరకినటుల
తొమ్మునసె కాని డించఁ డేయిమ్ము నైనఁ
బెట్టుచోటను బెట్టక వెలఁది నిపుడె
కట్టి కాచుక యున్నాఁడు కదలనియఁడు. 39

సీ. కనకాంగికట్టువర్గమె ఫల్గెవా టాయెఁ
గొమ్మపావడ చుట్టుకొనుట కాయె
నలివేణి నెమ్మోము నిలువుటద్దం బాయెఁ
జెలిగోటిలత్తుక తిలక మాయెఁ
దరుణిలేనునుతొడ ల్తలగడదిం డ్లాయె
వెలఁదిగుబ్బలు చెంప బిళ్ళ లాయె
లలితాంగిచెమ్మట ల్చలువపన్నీ రాయెఁ
గలికిమేను నలుంగు కలప మాయె

తే. బోటిపడకిల్లు జిగికొల్వుకూటు మాయె
లోలలోచనతొడిదే లోక మాయెఁ
బలుకు లేటికి నిపు డిళా భామనుండి
యచట శౌరికి దొరతన మమరె నమ్మ. 40

తే. మగువ యదిగాక యింక నొక్కమాట గలదు
వినుము వలపులదొరసాని యనెడుపేరు

డాని కిచ్చెను నినుఁ బిల్వఁ బో నటంచు
నెటుల నోరాడెనో శౌరి కెఱుఁగనమ్మ. 41

తే. రాధలోనను నాలోన రమణి యెవతె
తెలుపుమా యంచు నానతోఁ బలుక నాతఁ
డన్నిటను మీర లొక్కరూ పైనఁగాని
మురిపెమున నీవె హెచ్చనె మోహనాంగి. 42

వ. అనిన విని రాధాపధూరత్నం బి ట్లనియె. 43

ఉ. ఎల్లజగంబుల న్మనుచు నేలిక కంజభవాదిమౌనిహృ
త్ఫుల్లసరోజరాజములఁ బూని వెలింగెడితేజ మిందిరా
హల్లకపాణిబాహువుల కబ్బనిదివ్యసుఖంబు చిత్ర మీ
వల్లవకామినీచరణవారిజ సేవకు లెస్సఁ జిక్కెఁగా. 44

తే. వారి వీరిని నన నేల వీరి వారిఁ
గలగలపు చేయు న న్నన వలయుఁగాక
తెలఁగెలుంగక యపు డట్టు దిమ్మగొంటి
తలఁపఁ దనసుండి రానట్టి తప్పు గలదె. 45

తే. ఎల్లవారికి శకునంబు లెల్లఁ బలికి
బల్లి తాఁ బోయి తొట్టిలోఁ బడినరీతి
నొకరి నన నేల తాఁ జేసికొనినపనికి
వెనుకఁ జింతించు టెల్లను వెఱ్ఱితనము. 46

ఆ. హద్దుముద్దుమీఱి యాఁడుది మగఁ డంచుఁ
గూడి మాడి యాడఁ జూడఁ దలఁచి
బలిమి విందుఁ బెట్టి పగ గొన్నచందానఁ
బెండ్లిచేసి నేనె జేల నైతి. 47

ఆ. నక్క యురులలోనఁ జిక్కుకొన్న వితానఁ
గోరి మనము చేసికొన్న పనికిఁ
బేగులోనితీఁట వెత మాయె ననఁగ రా
ద త్తకొంగు తొలఁగినటులఁ జిలుక. 48

చ. కరి తఱుమంగ వాఁడిగలకంటకము ల్వాని మేనఁ గాడఁగా
సరి పడఁ బోవఁ బాము గని జాలిని మధ్యమసీమ నెల్కవే
కొఱికెడువేరు పట్టి చుఱుకుల్ తగఁ గందురుటీఁగ లెల్లెడం
గఱువఁగఁ జేనెఁ గ్రోలఁ జనుకామినితో సరి యైతిఁ గీరమా.

తే. నీవు పోయినపనికి రా నీవు కొదవ
పట్టి పల్లార్చి దేవకి పట్టి నిటకుఁ
దోడుకొని వత్తు వనుచు నీ తోడుచిలుక
నెమ్మి కన నెమ్మనమ్మున నమ్మి యుంటి. 50

తే. దాని వెలి చేసి శౌరి నె ట్లైనఁ గాని
తోడితెచ్చునుపాయంబు దోఁచ లేదొ
తోఁచ కాడితి నీ కేల తోఁచ నిచ్చు
ముందుపడ నాదుతల వ్రాఁత ముద్దుచిలుక. 51

వ. అనిన విని బె ట్టలికి చిలుక యక్కలికించితవతీతిలకంబుం
దిలకించి యీబాల యింతవేల యగునే యని బెట్టునిట్టూర్పు
నిగుడించి యి ట్లనియె. 52

సీ. చిక్కనికౌఁగిళ్ళఁ జిక్కె మై మఱచుచు
ఱొమ్ము ఱొమ్మున నాని రోఁజుకొనుచు
నొక్కరికెమ్మోవి యొక్కరు మార్చుచుఁ
గలగల్పుమణితము ల్పలుకుకొనుచు

నెదురయ్యెలల నెక్కి యెలనాగయును దాను
 జిగినోటిమడుపులు చేకొనుచును
గళ లీనుచెక్కుల నెలవంక లీనఁగాఁ
 దిలకము ల్గొనగోళ్ళ దిద్దుకొనుచు
తే. నచట వేసిన తెర వేసినట్టు లుండ
సరిగ చౌశీతిబంధము ల్సలుపుకొనుచుఁ
జెలఁగు వనమాలిఁ జేరితి సిగ్గుమాలి
వరుస నెటు తోడితెత్తు నో వన్నెలాఁడి. 53

క. తల కెక్కినవలపున హరి
యల యిళ దాసానుదాసుఁ డై మెలఁగంగాఁ
గలవె యిఁక నేటియాసలు
కలి పోసిన వెనుక నట్టి కనుఁగొనుమాడ్కిన్. 54

వ. అనిన విని మనస్సునఁ బట్టరాని కినుక పొడమినంత. 55

చ. అదరెడుమోవి తోట్రుపడుయానముఁ గుచ్చెల జాఱు
పైఁటయుఁ, జెదరినముంగురుల్ మిగులఁ జింతిలుచిత్తము
వాడుమోము లోఁ, బొదలెడివాంఛ గద్గదిక మోడ్పుక
నుంగవ మీఱ మారుచే, బెదరుచు లేచి యామెలఁత
వెన్నునిపైఁ దగుమచ్చరంబునన్. 56

సీ. జడ వేగ వదలించి ముడిపూలు విదలించి
 యలజడిఁ గీల్గంటు నందగించి
కలసొమ్ము లెడలించి వలయము ల్చిట్లించి
 నుదుటఁ గస్తురిబొట్టు కదియ నుంచి
కాటుక సమయించి కలపము ల్తెమలించి
 సరసవాసెనకట్టు సంఘటించి

దుగ్గరైక తొలగించి జిగిచల్వ నటు డించి
మాసినచీర సమ్మతి ధరించి
తే. వెతల మితి మీఱి వేసారి విధిని దూఱి
యలమటలఁ దారి జీవపుటాసలాఱి
పడకయిలు చేరి కంకటిపై నిజేరి
పొరలె మరులూరి చిలుకరాపొలఁతిదారి. 57

చ. పొరలును గొట్టుకాడు వెతఁ బొందును హా యనుఁ జింత
నొందు ని,ట్టూఱపడు వాడు లోఁ గుములు వెఱ్ఱిగఁ ద్రేలు
విరాళిఁ జెందు బల్,పొరుగుచు సొమ్మసిల్లు మదిఁ జొక్కు
వితాకవు మారు దూఱు నా,తరుణిని గేరు మారుకొనుతఱ్
హారి దూఱును బెట్టు మూర్ఛిలున్. 58

చ. ఉలుకును వెచ్చ నూర్చుఁ గడు నుస్సు రనుం దల యూఁచు
లేచు లోఁ,గలగఁబడుఁ దిగుల్పడును గానిపను త్తల
పోయు వేసరుం, గలవల మందుఁ గన్గొను వికావిక నవ్వు
భయంబుఁ జెందుఁ గ,న్గొలఁకుల నీరు నించు మదిఁ గొంకుఁ
దలంకు వడంకు నెంతయున్. 59

ఉ. రా యను వింత పుట్టినది రా యనుఁ జాతువు గాని వేడ్కలే
రా యను మేలువార్తవినురా యను నావల పింత చేసెనో
రా యను నిన్ను దూఱ నగరా యను నంటియె కాడు కాని
పో,రా యను దానిపొందె కనరా యను హా యదుశేఖరా
యనున్. 60

సీ. ఏయెడ నాఱొమ్ముఁ బాయనివీణ నే
పాటలాధర గోట మీటుకొన్కొ

ఉ. అప్పటిరాధ వేఱె మఱి యప్పటికృష్ణుఁడు వేఱె చూడ నే
డిప్పటిరాధ వేఱె కన నిప్పటికృష్ణుఁడు వేఱె యింక నే
లప్పటిమాట లానడత లాతగు లాగొఱ లేనికూటముల్
ముప్పునజవ్వనంపుసుఖముల్ దలపోసిన నేమి శ్రీహరీ! 75

ఉ. అప్పుడు మళ్ళి నామనసుకైనటు లాడుచుఁ జేరికన్ను లం
గప్పక బాస లిచ్చి దయ కన్పడ నీవె వికాళి గొల్వఁగాఁ
దప్పక నీవె నే ననుచుఁ దద్దయు నమ్మితి నాఁడునాఁడె నీ
గప్పయొలుంగుచిల్వ వని కాంతుఁడ నే నెఱుఁగంగ నైతిరా.

చ. తొలుతను జీమకుట్టునొకొ దోమలు గుట్టునొ యంచుఁ
జూచి నే, నెలమిగ నెత్తి పెంచి నిను నింతటివానిగఁ జేయు
టెల్ల నీ, చెలియల కొప్పగించి వెతఁ జెందనొ కూడి సుఖంబు
లందనో,వలనుగఁ దెల్పు మీవయిన వైనము గాఁగ మురా
సురాంతకా! 77

క. విషకంధరునెచ్చెలివై
విషకుచచనుబాలు గ్రోలి విషనిధిలోనఁ
విషధరుపైఁ దగునీకగు
విషమగుణం బేల పోవు విషరుహనయనా!. 78

సీ. ధరబెత్తనేత్తంబు తొరసాలెపద్దులు
వెలయాలికూరిమి విటులనియమ
మగసాలెనిజమును జగలోభియీవియుఁ
గలుబొమ్మగిలిగింత కాకితెలుపు
కోమటిసత్యంబు గొల్లనిరసికత
కాముకజనులజ్జ ఖలునికరుణ

చోరస్వదేశంబు జూదరిధర్మంబు
తగవరిమోమోట మలసునిరతి
తే. గగనకుసుమంబు గొడ్రాలుకన్నబిడ్డ
శశవిషాణంబు దుర్బీజజాతుఘనత
పంచమశుచిత్వ మల్లునిమంచితనము
గలదె నిన్నఁ బనియేమి కలికికృష్ణ. 79
తే. వాతె ఆనుచుఁ జెలిఁగూడువారు లేరొ
ప్రక్కఁబాయక సతి నేలువారు లేరొ
వనిత నైక్యము గొని పొర్లువారు లేరొ
వారు నీదారి మెడఁగట్టు కోరుగాని. 80
సీ. గోముఖవ్యాఘ్రిమై గుదిగొనుమాయత్త
వదినగారికి మాటు పలుక రాదు
మగఁడైతె యేవేళ మందుమునుండును
మామగారంతకు మంట్లమారి
పెదబావగారైతె బెబ్బులివలె దూఁకుఁ
బినబావ చేకత్తి పెట్టఁ డవల
నిరుగుపొరుగువారలే యమదూతలు
తోడికోడలి కెదురాడఁ గూడ
తే. దన్నదమ్ములు గన మేఁకవన్నెపులులు
పొరిపి నిందలికనుగట్టి సున్నఁబెట్టి
నేను నినుఁ జేర నీవందు దానిఁ గోర
బ్రతుకు బాగాయె ధూర్తగోపాలరాయ. 81
క. అల్లందు కందుకొనినీ
బెల్లింపులఁ బడినమొదలు పెనుబాములకే

యిల్లయితి నరసి చూడఁగ
గొల్లనితోఁ బొందుచెలికిఁ గొదవే కొదవల్.

క. మును నిన్నుఁ గోరి చేరిన
దనుజాంగనముక్కుఁ బోయె ధర నని తెలియన్
విని కని వలచితి ననుచో
నిను దూఱఁగ నేల నన్ను నే ననక హరీ.

సీ. మును మున్ను కొన్నాళ్లు మన యున్నయద్భుతం
బదివిప్పి చెప్పఁగఁ నలవి గాదు
తవిలి కొన్నిదినంబు లవల నఖేద మై
మెలఁగితి మెడ లేనిమేల్మి యొసఁగ
నంతట నీవు నే నని కొన్నివారమ్ము
లమరితి మిద్దఱ మగుచు వెలసి
యిప్పుడు ముగుర మై యీనలుగురిలోన
నిను గాఁపురము మూఁడువిధము లాయె

తే. నేమిటిసుఖంబు లిఁకమీఁద నేటిబ్రతుకు
లేటివలదలఁ బోయె నీమాట లెల్ల
నూర కిటు రవ్వ లిడి సరివారు నవ్వ
వసుధపైఁ దారి నే నుండ వలెనె శౌరి.

సీ. ఎన లేనిప్రేమ నీ వెపుడు వత్తువొ యంచుఁ
దలవాకి లిల్లుగా నిలిచి యుంటి
రమణ నవ్వుచు నీవు రాఁ జూతునే యంచుఁ
బడఁతులశకునంబు లడుగుచుంటి
ములు సోఁక కీవు రా వలెఁ జేర న న్నంచుఁ
గులదేవతల నెల్లఁ గోరుకొంటి

నేరీతి నైన నీ విటు రాక పో వంచు
నిలువని ప్రాణముల్ నిలుపుకొంటి
తే. మరునివెడవింటిపాల్పడి యెఱుక గంటి
నిపుడు నిను గంటి నీమాట లెల్ల వింటి
విడుపు మీఁకఁ దొంటిపోకలు నడువవంటి
దంటయిళయింటికే పొమ్ము తమ్మికంటి. 85
సీ. నీదుముద్దులగుమ్మ నీమోవి నొక్కితే
కటకటా నామది కంద నేల
నీప్రాణనాయిక నీచెక్కు గీటితే
కనలి నామది చుఱుక్కనఁగ నేల
నీదుచక్కెరబొమ్మ ని న్నెంచ కాడితే
పొగిలి నామది చిన్నవోవ నేల
నీదుపట్టపుదేవి నిను చాల నెనసితే
యుడుగక నామేను బడల నేల
తే. నీదుదొరసానిచనులచే నీయురంబు
నొగులఁ గ్రుమ్మిన నామది నొవ్వ నేల
దానిసొమ్ముల కెవ్వతెఁ దలఁచి చూడ
వలపు పగవారి కైనను వలదు కృష్ణ. 86
తే. మున్ను జత గూడి వెంటనే నిన్ను వీడి
ప్రాణములు చేర నిన్నాళ్లు పట్టి నొర
మరల నినుఁ బొంది పోయిన మరులు చెంది
జాలిఁ బడఁజాల నందగోపాలబాల. 87
క. ఈనాఁటివఱకుఁ గానని
యీనాయత మెల్లఁ గంటి నీనానినుఁ దా

నీనం గాచియు నిళకే
టూ నాయెను నింక నాస లేల మురారీ. 88

సీ. కావేటికాల్వలై కడుఁ బొలుకన్నీరు
వారక తుడిచెడువారు లేక
విరహాగ్నిశిఖలచే వేగుచుఁ బొరలాడ
నూరడిల్లుము యనువారు లేక
దిగులుచే నిల లేక తెగువ నేఁ జేయుచో
వల దని పలికెడివారు లేక
మరుకోల లెద నాటి నెరకొట్టు కాఁడఁగా
భయపడ వద్దనువారు లేక

తే. కలఁగి మోహాబ్ధిలో మున్గి గాలి సోఁక
గట్టు గానక యుంటి నే గాసిపడెడి
నాఁటికే లేనిమఱి నీవు నేఁట కేల
చాల తడ వాయె లెమ్ము గోపాలరాయ. 89

క. మానమె ధనముం గేహము
మానమె సర్వంబు చూడ మానవతులకుఁ
మానము పోయినవెనుకం
బ్రాణముతో నుండ వలెనె పద్మదళాక్షా. 90

తే. అన్నియిటు లాడఁ గాంచి మురాసురారి
రమణి దాసరితప్పు దండమునఁ దీరుఁ
దీరుమాన మటం చని తెలివపాద
పద్మముల వ్రాలె నళి తమ్మి వ్రాలినటుల. 91

క. కని మంజీరము ఘల్లన
వనజజరుద్రాదివిబుధవర సేవ్యంబై

తనరిఁహారిశిర మచ్చో
వనజేక్షణ ద్రోచె వామపాదము చేతన్. 92

క. లేచి యదూత్తముఁ డనుఁ జేఁ
జాఁచియు నాజన్న మిపుడు సఫలం బాయెన్
నీచిన్ని పదము నొచ్చెనొ
నాచికురభరంబు దాఁకి నాళీకముఖీ. 93

చ. నెలఁతరొ యాలకించు తొడనిగ్గు తళుక్కనఁ జీర జాఱఁగాఁ
గులుకు మెఱుంగుగబ్బిచనుగుబ్బలు పొంగఁ బసిండియందె
యల్ ఘులుఘులుఘుల్లనం జరణకంజములన్ గొని తన్నినంతమై
ఝలఝలఝల్లనం బులకజాలము లెత్తెన దేమి తెల్పుదున్.

సీ. చేతుల మెఱపుల చెన్ను లెంతైనను
దొడలఁ జెందిననిగ్గునడుము మేలు
గబ్బిగుబ్బల పెంపుకలుము లెంతైనను
బిఱుఁదుల నెరిమిన పెంపు మేలు
కనుబొమపైఁ దగుఘనఫాల మెంతైన
నునుబొత్తికడుపుకందువలు మేలు
చలి కెడు పెదవులఁ గలయొఱు పెంతైనఁ
బలుకనియలచోటిపొలుపు మేలు

తే. పైకి నెగిరినచీరయొ యాకసంబు
మిగుల నాలోని ద్రవమె పో గగనగంగ
యారనూఁగారు రేకయే కారుమొగులు
వనిత యాలింగనసుఖంబె వర్షఫలము. 95

చ. చులకనఁ జేసి నన్ వలపు చూఱలు వుచ్చిన వీడవాడినం
బలికినఁ బల్కకుండినను బాలను ముంచిన నీట ముంచినన్

జెలి మించఁ జాలు పొ మ్మనినఁ జేరఁగఁ బిల్చినఁ బిల్వకుండినన్
భళిభళి యౌను గా దనినఁ బాయుదునా నిను రాధికామణీ.

వ. అనిన విని. 97

క. వనజాక్షు యింత చేయఁగ
మనసొగ్గనె యంతె చాలు మానముకన్నన్
విను ప్రాణ మేమి ఘన మగు
నని యాసును వలపు కోప మదనము గాఁగన్. 98

ఉ. అందపుపైఁటకొంగు వదనాబ్జముపై నిడి శౌరి చూడ నా
యిందునిభాస్య యేడ్చె నెలుఁగెత్తి కలస్వన మొప్ప
వెక్కుచున్, సందగుగబ్బిగుబ్బలను జాఱెడుతన్నయనాంబు
పూరముల్, మందరమేరుశైలముల మాటికిఁ బాఱుఝరం
బులో యనన్. 99

చ. చెలి యటు లేడ్వఁ జూచి హరి చేరి పదంబులు పట్టి కూర్మి చే
మెలఁతరొ యేడ్వ నేల నిను మించినవాఁడనె కోపమంతఁ గాఁ
గలిగిన నన్నుఁ జేయఁ గలకార్యము లన్నియుఁ జేసికొమ్ము నే
తలఁపగ నీదుసొమ్మనుచుఁ దా బలిమింగొనికౌఁగిలించినన్. 100

ఉ. అంతఁ బడంతి మై మఱచె నంబుజనాభుఁడు మోవి యానె నీ
మంతిని చెక్కు నొక్కె హరి మర్మములంటె మిటారిముద్దిడెన్
కాంతుఁడు గోట మీటెఁ జెలి కన్గొనె వెన్నుఁడు నీవి విప్పెనా
కంతునిదంతి తారసిలెఁ గమ్మవిలుకాని పోరుకున్ వడిన్. 101

వ. ఇట్లనంగసంగరోత్సాహతరంగితాంతరంగులై రాధా
మాధవు లొక్కరొక్కరి చక్కనినెమ్మేని కమ్మనెత్తావుల
సొమ్మసిల్లుచు ముమ్మరంబగు మోహంబుల నెమ్మదిఁ జెంది రందు
నందు సోదరీరత్నం బవాంతరలజ్జాభరంబునుంగొన మందర

ధరుం డమందానందంబు నందంబగు చెందొగలవిందు చం
దంబును డిందుపఱచు సుందర మందస్మితవదనారవిందంబునం
గ్రందుకొని ముద్దువెట్టినం బెట్ట నీయక నిద్దంపుటద్దంబున
కుద్దియై తద్దయు నొప్పు ముద్దు చెక్కుల నొక్కిన నొక్క
నీయక కప్పుగాఁ గప్పు కప్పులం గుప్పు గొప్ప నెరికొప్పు నిమిరిన
నిమర నీయక చొక్కంపు కెంపుసొంపు సంపాదించు శావిచెం
గావి మోవి యానిన నాన నీయక కట్టాణిముత్తియంబులతీ
గె మోడికుట్టుపనులఁ గనుపట్టు కెంబట్టు రైక కుం బట్టుచాలక
మట్టుమీఱి గుట్టు బయటఁ బెట్టు గబ్బిసిబ్బెపు టుబ్బుగుబ్బ
చనుగుబ్బలం బట్టినం బట్టనీయక రంగుబంగరు దిండెనవిరి వెంట
నంటుతుంట వింటవిదంటయింటి నంటిన నంటనీక మించుమిం
చన మించుక్రొమ్మించు మెఱుఁదీగె కౌఁగిటఁ గదియించినం గది
యించనీయక దాపురంబులు వెట్టుచు నలయించిన నలయించు
విలుగొన్న మన్నె దొరం గన్న మిన్న యాయన్నులతల
మిన్న నొంటికళ లంటి సొక్కించి విశాళించి చివచివ లాడవఁ
జివు చివుక్కునం బై కెక్కి నిక్కి చక్కెరమోవి నక్క
జంబుగఁ జొక్క లేరుపడఁ జుఱుక్కున నొక్కి మక్కువ
నెక్కొనం జెక్కిలి గొట్టి మదదంతిపై మంతు కెక్కు
మావంతు లెక్కిన సొక్కు దక్కి గిలుకలచప్పరకోళ్ళ
మంచపుహాళహాళలును వెలిపక్కి రెక్క దూది మెత్తలో
నత్తమిల్లుకీచుబుఱ్ఱల కూఁతలును సురతశ్రమంబుల నెవల
గముగ మావలచు గోరజ వాపి ప్రోపి నెత్తావులు ఘుమ్ముఘుమ్మనం
గ్రమ్మ బిసబిసవిసరెడి హొంసపరిసురటిపిట్టల రెట్టచప్పుడులును

బకదారులమ్రోఁతలును సారసకోకిలములకివకివలును గ్రుక్క-
త్రిప్పక కొక్కొకశాస్త్రమ్ముం బ్రసంగించుకలికిచిలుకలకలకలం
బులం గప్పినపరవశమ్ములం దప్పినమరుసామువరుస లెత్తి
యిచ్చుగోరవంకల యెలుఁగులును, నిచ్చలపు ముచ్చటలం
బెచ్చుపెరుఁగ మెచ్చు లిచ్చు రాయంచలపళానళులును గళ
రవమ్ములును మంజుమంజీరఝుళంఝుళధ్వనులును విడకు విడు
వకు తడఁబడకు మెడమిడక విడివడి తొడఁబడ నదుముమదుపు
మునునుడువులును ఘనజఘనసంఘట్టనా చటచటాత్కా-
రంబులు తోరంబులై మీసరంబులగు పైసరంబు లెత్త
నాబిత్తరి తత్తఱిలక హత్తుకొని తళుకుతళుక్కు-మనుచిలుక
తేజీవజీరుహాజారంబునం దమి చిలుక నెదురొత్తు లిచ్చుచు
సాటిలేనిమేటిగోటిపోటులం జొత్తిల్లు కొత్తనెత్తురుల
మత్తిల్లుబిత్తరపుగుత్తంపుచనుగుత్తు లెద నొత్తి యిరుఁగేలు
సాఁచి కంబుధరుగళంబును గౌఁగిలించి మోము మోమునఁ
జేర్చి తేన్మధురాధరసుధారసధారలం గ్రోలి తియ్యనిరుచు
లందేలె నిట్టూరుపురు నొడ లడరఁ దొడరి దుడుకు లదలింపులు
భ్రూభంగంబులను చిఱుసన్న లుద్దవిడిపద్దులగ్గలికతాఁకు
నూఁకులు వీఁక మీఱ బాహాబాహిం గచాకచిం బెనంగుచుఁ
జెంగట నెసంగుభర్మనిర్మిత చిత్రరత్న రత్నమాలికాయంత్ర
పాంచాలికాహస్తవిన్యస్త మల్లరంగసముల్లసితమల్ల వల్లభుల
ద డివెనుదండివిడక న్యస్తసువర్ణ వర్ణనీయసుగంధబంధుర
సుమతాళవృంతోద్ధూతవాతప్రవర్ధి తాగురుధూపధూమ
స్తోమంబు లెగిరి నిగనిగ మను జిగిమొగు లనఁ గప్పుకొని

యన్యోన్యాననాలోక నోత్సాహ మోహంబుల నించుక యప
నయింపఁ బునఃపరస్పరదర్శనోద్యోగ వేగంబులం బుట్టి పెట్టు
నిట్టూర్పు గాడ్పులం గొట్టువడి యొట్టకేలకుం దెట్టగిలి తెట్టిన
మొగంబులు చూచుకొని తడ వెడసి యొడఁబడినజక్కవ
పక్కులమక్కువలంది యింపొందం బొందుచౌశీతిబంధప్రతి
బింబంబుల ముకురంబులం గని సంకుచితమందహాసంబుల
నిరవొందుచు నెనంగుసమయంబున. 102

క. హత్తుకొని యిన్నివిధముల
దత్తఱపడ ననఁగి పెనఁగి తనివారక యా
బిత్తరి పైకొనె హరిపై
మత్తేభముమీఁద నెక్కుమావంతుఁ డనన్. 103

సీ. మరుగుడారముఁ బోలెగిఱికొన్న నెరికురు
ల్గ్రిమ్మి ముద్దోఁచుచీఁకటులు గాఁగ
జలజల మని రాచి సన్నజాజులచాలు
చీలి వ్రాలెడురిక్కచాలు గాఁగఁ
జిలుకమ్మచెమ్మట ల్నెరిఁ దోఁచుఫాలంబు
రేతేనిచిన్నారి రేక గాఁగఁ
గరఁగి జాఱినసిస్తు కస్తూరితిలకంబు
క్రందుగాఁ జెలు వందు కందు గాఁగ
తే. వలపుచిలువవ్వు లలతివెన్నెలలు గాఁగ
నాశలను బెంచి కౌనని యంద మూని
కృష్ణపక్షమురీతి నాకృష్ణవేణి
కృష్ణదేవునిపై నుండి కేళి సలిపె. 104

సీ. చెండు గోరించినదండిగాఁ బైనుండి
కులుకుచపన్నులఁ బడుఁ గొంతసేపు
గాలి చక్రముఁ జుట్టుకరణిని దిరుగుళ్లు
వింతగాఁ దిరుగును గొంతసేపు
పసిఁడిజంత్రపుబొమ్మపగిది విన్నాణముల్
కులుకుచు నటియించుఁ గొంతసేపు
తుద నాడుబొంగరం బిది నాఁగఁ గసి దీఱఁ
గంతుశివం బాడుఁ గొంతసేపు
తే. అభినయము పట్టు పని చెక్కు నమరఁ గొట్టు
ముద మొదవఁ దిట్టు ముద్దుపై ముద్దు వెట్టు
మర్మములఁ గొట్టు మెలమెల్ల మబ్బు దట్టు
బాల హరిపైని బుంభావకేళి వేళ. 105

చ. సరసిజగంధి యీపగిది శౌరిని గూడుక కౌఁగిలింపఁగా
గిఱికొని ముత్యపుంగసరులు కెంపులదండలు ఝల్లుఝల్లనన్
బెరుగుచు రాలె మన్మథుఁడు పేర్చినమల్లియతూపుగుంపు త
ద్గురుశిఖివిస్ఫులింగములఁ గూడుక రాలినలీల దోఁపఁగన్.
వ. అట్టియెడనున మదనజనకుం డామదవతిం జూచి యిట్టు
లనియె. 107

సీ. వలుదగుబ్బలగోరువంక లేడవి రాధ!
యవి నీవెఱుంగుదు వంబుజాక్ష!
చక్కెరకెమ్మోవి నొక్కు లేడవి రాధ!
యవి నీ వెఱుంగుదు నమరవంద్య!
మిసిమిటెప్పలఁ దమ్మరసము లేడవి రాధ!
యవి నీవెఱుంగుదు వాదిదేవ!

తగువెన్న సరిపెనదండ లేదవి రాధ!
యవి నీ వెఱుంగుదు వతనుజనక!

తే. యనుచు నిరుపురు గడిదేరి హాపుసుమీఱి
యాని సరిపోరి కెమ్మోవు లానఁజేరి
తమి చెలఁగఁ జేరి యలకేరజఃఖులఁ దారి
కోరి మరుబారి నలసిరి కొమయ మీఱి. 108

సీ. రమ్యబృందావనారామసీమలయందు
నతులితగోవర్ధనాద్రియందు
సత్ప్రభోజ్జ్వలరత్నసౌధాగ్రములయందుఁ
దరణిజాసైకతస్థలములందుఁ
బారిజాతలతాంతపర్యంకములయందు
బహుచిత్రకేళికాగృహములందు
మారుతకలితవానీరకుంజములందు
భీమనదీతీరభూములందు

తే. సరసభాండీరవటతరుచ్ఛాయలందుఁ
జారుతరచంద్రచంద్రికాపూరమందు
దేవదేవుండు రాధికాదేవితోడఁ
గూడి విహరించె మదిలోనికోర్కు లలర. 109

తే. సంపదలు గల్గు రాధికాసాంత్వనంబు
చదివినను విన్నఁ గైకొన్నఁ జదువుచున్న
వారి కవ్వారిగా నలవార వారి
జాక్షుఁ డొసఁగును గోరిక లధికదయను. 110

శా. శ్రీలక్ష్మీముఖపద్మషట్పద తనుశ్రీక్షిప్తనీలాంబుదా
లీలామానుషవిగ్రహా ప్రమదలేలీహానశయ్యాస్పదా
కాళిందీతటకేళికోవిద మహాకంసాదిదుష్టాత్మదా
కాళీయోరగరత్నరంజితపదా కౌంతేయధైర్యప్రదా. 111

క. సారగదాధార సదా
చార సదాతనువినూత్న చారుతరోద్య
న్మారజితాకారయుతా
ధీరసుతాపారచరితధిక్కృతదురితా. 112

మత్త. నాగపాలక నాగదాలక నాగఫాలకవాహనా
వాగధీశ్వర వాగహీశ్వర వాగనశ్వరగాహనా
యోగచారణ యోగధారణ యోగకారణ సాహనా
భోగశోషణ భోగినీషణ భోగిభూషణమోహనా. 113

గద్యము. ఇది శ్రీచిన్నికృష్ణకరుణాకటాక్షవీక్షణక్షణప్రవర్ధమా నానూనశృంగారరసప్రధాన సంగీతసాహిత్యభరతశాస్త్రాది విద్యాపారంగత శ్రీమత్తిరుమల తాతాచార్య పాదార విందమిళిందాయమానమానస చోళసింహాసనాధ్యక్ష ప్రతాప సింహమహారాజ బహూకృతానేకచామీకరాంబరాభరణ ముత్యాలుగర్భశుక్తిముక్తాయమాన ముద్దు పళనిప్రణీతం బైన రాధికాసాంత్వనం బను శృంగారప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

# కడనుడి

గీ. చిన్నికృష్ణుని కరుణావిశేషమునకుఁ
బాత్రురాలగు మాముద్దుపళని ముద్దు
లొలుక వ్రాసిన దని దీని నుద్ధరింప
సాహసించిన యీనన్ను సైచవలయు.

చ. వదలఁగ బుద్ధి పుట్ట దిటువంటి ప్రబంధము నెన్నిసారులేఁ
జదివిన నింకనుం జదివి సంతస మందఁ దలంచుచుండు నె
మ్మది యని తప్పు లెన్నియొ సమంజస మౌగతి దిద్దియుంటినో
చదువరులార! నాదయినసాహసముం క్షమియింపవేఁడెదన్.

ఇట్లు,
సహృదయవిధేయురాలు,
బెంగుళూరు నాగరత్నము.

# *సప్తపదులు



నీలాదేవి పయోధరాద్రినడుమన్ నిద్రించు శ్రీకృష్ణునిన్
మేలా నీకిది వేదవేద్య యనుచున్ మేలొప్పఁగా లేపి తా
వాలాయంబుగఁ గొప్పునంటి మిగులన్ వాసించుపూదండచే
లీలన్ గట్టినగోద కెప్పుడు మనోలీలాళికిన్ మ్రొక్కెదన్.

---

* ద్రావిడవాఙ్మయమున నేకదేశమై, విశిష్టాద్వైతమతావలంబులకు బరమాదరణీయమును నై "తిరుప్పావై" యనుపేర నొకముప్పదిపాశుర (పద్య)ముల సంపుటి గోదాదేవీప్రణీతంబై తనరారుచున్నది. అద్దాని కను వాదరూపములై సప్తపదులుగా 10 పాటలుమాత్రము ప్రాచీనకవికృతములై యసంపూర్ణముగ ప్రచారమున నున్నవి. ఈసప్తపదులకర్త యెవ రనువిషయ మున మతభేదములు ప్రచారమున నున్నవి.

ఈసప్తపదులు 'రాధికాసాంత్వన' కర్త్రియగు ముద్దుపళని ప్రణీతము లనియు, ఆవిషయమునే "శ్రీనివాసగురుల దలచి చిత్తమునను ముద్దుపళని" అనుపాదము ప్రమాణీకరించుచున్న దనియు ఒకమతము.

పైజూపిన సప్తపదిపాద మటులుగాక "శ్రీనివాసగురుఁడు విష్ణు చిత్తుకూతు ముద్దుపట్టి" యని యుండవలసిన దయియుండగా పరివర్తులచిద్ద పాటున రూపాంతరము నొంది ముద్దుపళనిరచితములుగా వ్యవహృతము లయి పోయిన వనియు, అట్లుగాక యయ్యవి శ్రీనివాసగురురచితము లయియుండు ననియు మరియొకమతము.

కవి యెవ రను నిర్ణయమున నాగ్రహమును విడిచి భక్తిరసభరిత మయిన యీసప్తపదులను పాఠకుల కందించు తలంపున ప్రాచీనకవి నిబంధితములై యుంపలభ్యమానము లైనవాటినిమాత్రమే యిట పొందుపఱచుచున్నాము.

౧

### మార్గళి త్తింగళ్

శ్రీనివాసగురునిఁ దలఁచి చిత్తమునను ముద్దుపళని
పూనిచేయు ద్రవిడపాటలోని భావమై
చెలఁగి తెలియ వాణి తనదు జిహ్వాకొనను నిలిచి యిటుల
పలికెఁ దిరుప్పావు సప్తపది పదంబుగా—
మాసములకునెల్ల మంచి మార్గశిరము పర్వ మహహా
యాసగలిగినట్టి చెలులు డాసి రారే!
మంచివగల మించి కులము నెంచి యవతరించినట్టి
చంచలాక్షులెల్లఁ గూడఁ జనఁగ రారే!
న్యాయశాలియైన నందనందనుఁడు తోయజాక్షీ!
శ్రీయశోద కనిన సింహశిశువు గాఁడటే
నల్ల మబ్బుచాయమేనిఁ దెల్లఁజేయుడాలు గల్గు
పుల్లపుండరీకనయన పురుషవర్యుఁడే!
కీరవాణులార! హరిని గోరి చేరి తేరి సకల
పూరుషార్థములను దృప్తిపొంద రారే!

౨

### వైయ్యత్తువాళ్

వారిజాక్షులార! నందవ్రజనివాసులార మనము
కోరునోము క్రియలు వినుఁడి కూరి మలరఁగా

పాలవెల్లిఁ బాపసెజ్జఁ బండుకొన్న పరుని యడుగు
  లోలిఁ గొల్చి నేయిపాలు గ్రోలఁగూడదే!
కనులఁ గొనలుదీర నునుపు కాటుకుంచరాదు విరుల
  ననలఁ దుఱుమరాదు కురుల నునుపుమీఱఁగా
తెల్లవాఱకుండ నీటఁ జల్లులాడి మనము పెద్ద
  లెల్లఁ జేయునట్టిపనుల నొల్లఁగూడదే!
వికచ కమలనేత్రునెదుట నొకరికొకరు పల్కుపలుకు
  ప్రకట మొప్పఁగాను బలుకఁబడఁగఁగూడదే!
బాగుమీఱ మనకుఁ దెలుపఁబడినతీరు జనులకెల్ల
  వేగ తెలిపి బ్రదుకుతీరు వెదకి ముదముగా
సారెసారె విభుని మనము సన్నుతించి సంతసించి
  వారిజారిముఖుల మెల్ల వ్రతముచేతమే!

3

ఓంగియుంళగలంద

నోమునోఁచువారు నోఁచు నోముతీరు తెలిపె గోప
  కామినులకు విష్ణుచిత్తకన్యకామణీ
వడుగుచిన్ని పెండ్లికొడుకు పొడవుఁదొడరి పుడమియాఁ
  డడుగులవానిపేరు నుడువుకొనుచునే
ప్రేమమీఱఁగాను మనము నోమువట్టి నీళులాడ
  భూమిమీఁదఁగురియు నెలకుమూఁడువానలే
పెరుఁగునీటివరులనడుమఁ దిరుగుమీలు దాఁటఁగా న
  కరులతెరలుపొరలుగదలి కలువ లూఁగఁగా

నెమ్మిమీఱఁ దేనెఁద్రావి సొమ్మసిల్లి నట్టియాఁడుఁ
దుమ్మెదలునుఁ జేగి మగల దూఱి పలుకఁగా
చెలఁగి పిదుకఁగలుగువాఁడు చెయ్యివేసితియ్యఁగాను
నిలువుకడవలెల్లఁ బాల నిండిపొరలఁగా
కుదురుకొందమ మొదవుగుంపు పదులునూర్లు పెరుఁగ సం
పదలఁబొదలిగొల్లపల్లె బాగుమీఱునే!

౪

ఆజ్ఞిమకైక్కణ్ణా

గోపవృద్ధులెల్లఁగోరు కోర్కిఁగురియువర్ష దేవు
రూపుఁజూచిచేయు క్రియల రూపుఁదెలిపిరే!
"ఓగభీరభావమేఘ! ఓగుణాఢ్య! దానధుర్య!
బాగుగ నీచేయవలయు పనులువింటివా?
జలధికేఁగి నడిమిజలము కొలఁదిమీఱఁ ద్రావి యుఱిమి
వెలయఁ గలయ మిన్నుమట్టి యెలముకోవలెఁ
జలధిశాయిమేనిడాలు గలుగునట్టిమేనుదాల్చి
చక్రకాంతిసరణిదెలియఁ జక్క మెఱయుమా!
పాంచజన్యమనెడుసంకు పగిది మ్రోసి శార్ఙ్గపట్లు
మించి యంబు లొక్క మొగిని నించి కురియుమా
గాముకొన్న మేముమేని గాముదీఱ జేపకడను
క్షేమ మలర నీటనాడి చెలఁగి యుందువే!

నందసుతునిఁగూడి గోప సుందరాంగు లెల్ల ముదము
    చెందుకొలఁకుఁ గురిసె మేఘుఁ డందుమెందునున్".

౫

మాయమై మన్ను

"కోమలాంగులార! మనసు కోర్కెలెల్లఁదీర మనము
    నోమునోఁచగాను వాన భూమిఁగురిసెనే".
అనిన, నొక్కచెలియు పలికె "వనితలార! మాయవాని
    ఘనుని నుత్తరంపుమధురఁ గాంచువానినే!
గొల్ల పిల్ల లందుఁగలన జల్లులాడి కొల్లలాడి
    యుల్ల సిల్ల యమునచెంత నున్నవానినే!
యదుకుల ప్రదీప మనఁగ నుదయమంది కన్నతల్లి
    యుదరశోక మెల్లఁబాపి యొప్పినాతనే!
కాంతలార! మనము శ్రీకాంతుఁగూడి చెంత వాని
    వింత నోటి నిండఁబాడి వినుతిచేసినా
చేతులున్న ఫలము పూజసేయ శుద్ధభావములను
    ఖ్యాతిమీఱ వానితోడఁగలయఁగల్గినా
తొంటిపాపజాల మెల్ల మంటఁబడినదూదివోలె
    నంటులేక చెడును నోముపంటపండునే!

౬

పులకించిన గాన్

ముందులేచినట్టిసకల సుందరాంగు లొక్కముగ్ధ
    మందయాన నిటులనిదుర మలుపవచ్చిరే!

పక్షిజాలమెల్ల దెసల వీక్షణములు గొలిపి వేగ
కుక్షులకయి కూఁతలిడుచు గూళ్లువదలెనే!
పంకజాక్షుసేవజ్ఞప్తి పలుచుకొలఁకుఁ దెలుపుతెల్ల
సంకుపిలుపునీదుకర్ణ సరణిఁజొరదటే!
బాల! లేచిరావె! నందబాలుఁడు దాఁబూతనచనుఁ
బాలుద్రావి దాని యమునిపాలుచేసెనే!
రక్కసుండు బండిరూపు నుక్కుమిగిలిరాఁగ సంధు
లొక్క మొగిని వ్రక్కలుగాఁ ద్రొక్కె ముద్దగా
మునులు యోగిజనులు నీటమునిఁగివేడ్క "హరి" హరి
యనెడునాద మిసుమడించె వినఁగరాదటే!
మెల్ల మెల్ల నుల్ల మల్లఁ బల్లవించిచెల్ల సంత
సిల్లి లేచినారమిటుల మల్లి లేఁగదే!

## ౭

### కీచుకీ[illegible]

విరివిమీఱ హరిని గలయనెఱిఁగి మఱచికను మొగుడ్పు
సరసిజాక్షినిదుర లేప సఖులువచ్చిరే!
కుటిలనీలకుంతలొకతె చటులసూక్తి పటిమఁబల్కు
నటనదెలియకుండ నొక్కనాతి పలికెనే!
"కీచుకీచు' మనుచుఁ బక్షు లేచి లేచి కూయుచుండె
లేచిరావె పెరుగుతరువఁదోఁచె మిన్ను నే!
"గల్లుగల్లు'మనెడినగల కలగవంబుఁ దెల్లదమ్మి
కనులవానిమీఁదిపాటఁ గలసిమ్రోసెనే!

వినఁగఁబడదె వెఱ్ఱిపిల్ల విడిచి నిన్ను వెడలలేక
కనుగొనంగ నున్న మమ్ముఁ గనవె నాయికా
హరి దయాభిపరవశుండు పరుఁ డటన్న మొరలు చెప్పి
దరికిరాఁగ నిదురచెందఁ దగునె నాయికా!
తేజమొప్పఁ గన్నువిప్పి తెప్పరిల్లి లేచివచ్చి
రాజసమునఁదలుపుఁదీయ రావె నాయికా.

౮

కీర్వాణం

బాలలెల్ల నందగోప బాలునకును వలపుగొలుపు
లీలగలిగినట్టిసఖిని లేపవచ్చిరే!
ఇదిగొ తూర్పు తెల్లవాఱె నదిగొ బఱ్ఱె లెల్ల మెల్ల
బొదలె మళ్ళలోనిమంచు పూరిమేయఁగా
నిన్ను లేపకుండ నున్న కన్నెలార్తి తోడ నేఁగి
ఉన్నమాట విన్నవించి నిన్ను లేపఁగా
వచ్చినార మనుచు మమ్ము మెచ్చి మొగము హెచ్చినట్టి
మచ్చెకంటిమిన్న లేచి మముఁ గలయవే
ముల్లపరులయుల్ల మెల్లఁ బెల్లగిల్ల కొల్లలాడి
వెల్లివిరిసి యుల్లసిల్లు విష్ణుమూర్తినే!
పాడుకొనుచు నేఁగి చిగురు టేడువచ్చునడుగుఁదమ్మి
జోడుసోఁక మ్రొక్కి సరగ వేఁడుకొంటిమా
ఎంతవింత కాంత లంత కంతకంత కింత యనుచుఁ
జింతచేసి మనలఁగరుణ చెలఁగి ప్రోచునే.

౯

తూమణిమాడత్తు

'వాఁడె వచ్చి పిలువ లేచి వత్తే' ననుచుఁ బండుకొన్న
చేడె నిదుర లేపఁగాను జెలులు వచ్చిరే!
మణివిచిత్రసౌధమందు మంగళార్థమైనదీప
కణిక లుల్లసిల్ల బొగలు గమ్ముమనఁగనే!
కులుకుతళుకు శయ్యనిద్రఁ గూడినట్టి మేనమామ
కూర్మిబిడ్డ! గడియతలుపు గొలుసుములుపవే!
అత్త! పూలగుత్తి నీదు ముత్తియంపుబిడ్డ మెల్ల
నొత్తిగించి నిదుర లేవ నెత్త రాదటో!
మూఁగ చెవుడు గలదొ లేక రాఁగనీకమత్తునిదుర
సాఁగితూఁగ నెవరు మందు చల్లినారలో!
మాధవుండు మాయలాడు వేధకైన బోధలేని
గాధవాని వెయివిధాల గణన చేతుమే!
అమ్మ! తోడి కొమ్మ లిరుగొ, లెమ్మనంగదమ్మ ముద్దు
గుమ్మ నీదు తెళుకుఁ గులుకుబొమ్మ నిప్పుడే!

౧౦

నో త్తు చ్చు వ ర్గం

నందనందనుఁ డన నానంద మొందువార లొక్క-
కుందరదన నిదుర లేపఁ గోరి వచ్చిరే!
నోఁచునోము స్వర్గమిచ్చు నోచెలీ యిదేల తల్పు
పైచిపండుకొంటి విట్లు వడిగ రాగదే!

నీటుమీఱఁ బల్కవున్న చోటనుండిమాటి కొక్క
నోటిమాటకైన మేము నోఁచలేదటే!
వలసినట్టిచోట కలసి మెలసి సిరుల వెలసి శ్రీ
తులసిదండఁ గురులనిండఁ దుఱుమువాఁడటే!
పొంగి మంగళంబు లొసఁగి పొగడినంత మనకునంత
రంగవాంఛలిచ్చుపుణ్య రాశిగాఁడటే!
ముందునిదురయందుఁబేరు నొందినట్టి కుంభకర్ణు
డిందు నోడి నీకు నిద్ర యిచ్చినాఁడటే!
తత్తరమ్ము మాని నిద్ర మత్తువీడివచ్చి చెల్మి
కత్తెలతో నిపుడు నీవు పొత్తుగూడవే!

# తెనుగు శృంగార ప్రబంధములపై
# దొరతనమువారి నిషేధము తొలగింప
# శ్రీవావిళ్ల వేంకటేశ్వరులుగారు చేసినకృషి

## అ వ తా రి క

### శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు.

శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు చక్కనిపండితులు మంచి మేధావులునై సంస్కృతాంధ్రసారస్వతములకు వానిమూలమున దేశమునకు మహాసేవచేయు పవిత్రసంకల్పముతో క్రీ. శ॥ 1856-వ సంవత్సరమున ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాల అనుపేర నొక గొప్పసంస్థను స్థాపించి సంస్కృతాంధ్రగ్రంథప్రకటనమును గ్రంథవిక్రయమును కొనసాగింపనొడగిరి. వారి సంకల్పసౌభాగ్యమున ఆసంస్థ దినదినాభివృద్ధినొందుచు దేశమున మిక్కిలి ఖ్యాతిపందుచుండెను. స్వయముగా మహాపండితులైన శ్రీరామస్వామిశాస్త్రిగారు తమ యమోఘకృషివలనను దమకు జేదోడు వాదోడుగ నుండదగు పండితాగ్రణులనైకొనియు నెవ్వరును నూహింపజాలనంత విశిష్టముగా నెన్నెన్నో సంస్కృతాంధ్రగ్రంథములను భారత భాగవత రామాయణాదుల నాంధ్రలోకమునకు బ్రసాదించి యాంధ్రుల దురదృష్టమున శీఘ్రశేషులైరి.

### శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు.

ఆతరువాత క్రీ॥ శ॥ 1908-వ సంవత్సరముమండియు వారి పుత్రరత్నమగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు ముద్రాలయమునకు వావిళ్ల

ముద్రణాలయ మను పేరు పెట్టి దానికిని శ్రీరామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ అను గ్రంథవిక్రయసంస్థకు ప్రధానాధిపతులై మహనీయులగు తమ తండ్రి గారి యడుగుజాడలలో అదర్శప్రాయముగా నడచుచు దండ్రికి దగినపుత్రులని యనేకవిధముల ననేకులచే నమితమగుఖ్యాతి సంపాదింపదొడగిరి. తమ తండ్రిగారు కీర్తిశేషులగునాటికి దాము విద్యార్థులై యుండియుం దా మున్నతోద్యోగము లాశించి కళాశాలలలో జదువుకొనుచు బరమపూజ్యులైన తమతండ్రిగారు స్థాపించిన సంసను విసర్జించుట పితృద్రోహము అని శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు గ్రహించి తమ స్వార్థమును త్యజించి చదువుమాని మహాత్యాగధనులై తండ్రిగారు స్థాపించిన సంస్థల నభివృద్ధిపరచుటకే కృతనిశ్చయులైరి. లేనియెడల శ్రీశాస్త్రిగారు ఏఐ.సి.యస్ పరీక్షలోనో కృతార్థులై ఏకలెక్టరుద్యోగమో చేసియుండెడివారు; లేక ఏరాజకీయనాయకులుగనో మహా విఖ్యాతి గాంచి యేరాష్ట్రమంత్రిపదవియో పొందియుండెడివారు. కాని ఆత్మజ్ఞానప్రదము లైన సంస్కృతాంధ్రమహాగ్రంథముల మూలమున దేశమునకు జ్ఞానభిక్ష పెట్ట దలచి ఆత్మోపలబ్ధికి గాక దేశక్షేమమునకై పితృవాక్పరిపాలనార్థమై శ్రీశాస్త్రిగారు పై యైహికోన్నతి నికృష్టమని నిరసించినవారు. ఈమహాగుణమే శ్రీశాస్త్రులవారి ప్రధానగుణమని గ్రహింపవలసియున్నది. అటులని ఊరకొనక 1908-వ సంవత్సరమునుండియుం నేటివరకు తమకు వీలయినంతలో రాజకీయములలో పాల్గొనుచునేయున్నారు. తమ త్రిలిఙ్గద్వారా నిర్భయముగా రాజకీయముల విమర్శించుచు ప్రచారము చేయుచున్నారు.

## శృంగార ప్రబంధ ప్రకటనకై
## శ్రీశాస్త్రిగారిపై మొదటి అభియోగము.

పాండిత్యమునను పట్టుదలయందును కార్యదీక్షయందును శ్రీవేంకటేశ్వర శాస్త్రులుగారు తండ్రికి ఉద్దియైనవారై నిరంతరాయమానముగ దమసంస్థలను

వృద్ధిలోనికి వేగలిగిరి. ఈపరిస్థితులలో అసూయాగ్రస్తులైన కొందఱిప్రయత్నమువలన 1911-వ సంవత్సరమున శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారిపై నొక యభియోగము రాష్ట్రప్రభుత్వమువారు తెచ్చిరి. అందు శ్రీశాస్త్రులుగారు 1. తారాశశాంకవిజయము, 2. బిల్హణీయము, 3. గణికాగుణప్రవర్తన తారావళి, 4. వీథినాటకము, 5. హంసవింశతి, 6. కవిచౌడప్పశతకము, 7. వేణుగోపాలశతకము, 8. వైజయంతీవిలాసము, 9. రాధికాసాంత్వనము అను గ్రంథములు ప్రకటించి విక్రయించుచున్నారనియు అం దెన్నియో అసభ్యవర్ణనలు గలవనియు వానివలన జదువరులు చిత్తభ్రమణము పొందుదురనియు 293-వ సెక్షను ఇండియన్ పీనల్‌కోడ్డు క్రింద శిక్షార్హ మనియుం ప్రభుత్వమువారు వాదించిరి. దీని ననుసరించి శ్రీశాస్త్రులుగారి ముద్రాశాల నుండియుం ఎస్ప్లనేడు షాపునుండియుం పై గ్రంథప్రతులను పోలీసు *డిష్ట్రి కమీషనరు కన్నింగ్‌హామ్ వశపఱచుకొనిరి. ఆపిమ్మట తే 22-5-1911 దీని పైకారణములుచూపుచు నేరమును శ్రీశాస్త్రులుగారిపై మోపిరి.

* ఈ కన్నింగ్‌హామ్‌సోదరుడు ప్రొఫెసర్: జె. ఆర్. కన్నింగ్‌హామ్. శ్రీశాస్త్రిగారికి పచ్చయప్పకళాశాలలో ఆంగ్లోపన్యాసకులు. అప్పుడిప్పుడు శ్రీశాస్త్రిగారు ఈ ప్రొఫెసర్ ఇంటికి వెళ్లినపుడు కమిషనరు పరిచయ మేర్పడినది. ఇనస్పెక్టరును పంపియుండెడి వారుగాని వీరిపేరు చూడగనే నిర్ఘాంతపోయి తానే స్వయముగ శ్రీశాస్త్రిగారి కొట్టుకు బయలుదేరివచ్చిరి. ఎవరో శ్రీశాస్త్రిగారితో మాట్లాడుచుండగా కొంత ఆగి ఆపైని శ్రీశాస్త్రిగారి నివతలకు పిలిచి కొట్టులోని గుమాస్తాలను ఇతరులను పైకి పంపివేయు మని కోరెను. వారువెళ్లగనే శ్రీశాస్త్రిగారిని మందలించి వారిపై వచ్చినారంటు ఉన్నదనియుం కొట్టులోని పుస్తకములన్నిటిని సోదాచేయువలె ననియుంచెప్పిరి. ఇందుకు బదులుగా శ్రీశాస్త్రిగారు మా మేడమెట్లమీద ఒక పోలీసుజవానును కూర్చుండబెట్టి తాము వెళ్లండి. మూడుగంటలకు మరలవచ్చినచో వారంటులో కనబడిన పుస్తకములనన్నిటిని కట్టలుకట్టి సిద్ధముచేసెదను. తాము తీసికొని వెళ్లవచ్చును అని చెప్పిరి. వా రట్లే చేసిరి.

## శ్రీశాస్త్రులుగారి పట్టుదల.

ఈసందర్భమున శ్రీశాస్త్రులుగారు తగు సంజాయిషీచెప్పుచు తమ దప్పిదమును మన్నింపు డనియు ఇక నెప్పుడు పట్టిగ్రంథములను ప్రకటింప మనియు నన్నచో వారిమీద అభియోగమును ప్రభుత్వమువారు తీసివేసి యుందురు. కాని శ్రీశాస్త్రులుగారు భాషావిషయమున ఆయాగ్రంథములు చక్కనిస్థానమాక్రమించిన వనియు నాయాగ్రంథకర్తలు సుప్రసిద్ధు లనియు పట్టిగ్రంథములను నిషేధించుటకు ప్రభుత్వమున కర్హత లేదనియు పట్టి నిషేధము భాషావృక్షమునకు గొడ్డలిపెట్టనియు నిశ్చయించుకొనిరి. ఈకారణమున వ్యయప్రయాసల కెన్నిటికైన ఓర్చి భాషాసేవయే పరమావధిగ బెట్టుకొన్నవారు కాన ప్రభుత్వముతో పోరాడ సమకట్టిరి. అపుడు †శ్రీ పేరి నారాయణమూర్తిగారు శ్రీశాస్త్రులుగారి న్యాయవాదియై నిష్కామిగ శ్రీశాస్త్రులుగారి పక్షమున వాదించిరి.

---

†శ్రీ పేరి నారాయణమూర్తిగారు పేరూరి ద్రావిడశాఖకు జెందిన వారు. వీరి జన్మస్థలము గోదావరిజిల్లా అమలాపురము సమీపమందలి పేరూరు అగ్రహారము. వీరిపూర్వీకులందరిలో (పేరూరు ద్రావిళ్లలో) వేదవేత్తలేగాక అఖండశాస్త్రపండితు లనేకులు గల రనిచెప్పుట అతిశయోక్తిగానేరదు. వైదిక లనేకులు సంస్కృతవిద్య మాని ఇంగ్లీషువిద్య గడించినట్లే శ్రీనారాయణమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్. పరీక్షలలో కృతార్థులై కాకినాడలో న్యాయవాదిగనుండి కీర్తిగడించిరి. వీరు మిత్రులగు శ్రీపోలవరము జమీందారు మున్నగువారి ప్రోత్సాహమున చెన్నపట్టణము చేరిరి. హేమాహేమీలగు శ్రీభాష్యము అయ్యంగారు. శ్రీ వీ. కృష్ణస్వామిఅయ్యరు, శ్రీ పీ. ఆర్. సుందరఅయ్యరు, శ్రీ యస్. శ్రీనివాస అయ్యంగారు, శ్రీ కె. శ్రీనివాస అయ్యంగారు, శ్రీ టి. రంగాచారిగారు, శ్రీ శివస్వామిఅయ్యరు, శ్రీ టి. వీ. శేషగిరి అయ్యరుగారు మున్నగు అఱవన్యాయవాదులే గాక ఐరోపియన్ బారిష్టర్లు గ్రాంటు, నూజెంటుగ్రాంటు, రిచ్మాండు, వార్టన్ మున్నగువారు

ఈసందర్భమున ‡శ్రీగోటేటి కనకరాజుపంతులుగారు ప్రభుత్వము నైకొన్నచర్య సామోదించుచు రాధికాసాంత్వనములో ఈక్రిందిపద్యము లసభ్యము లని వాఙ్మూల మొసగిరి.

---

హైకోర్టున ప్రాముఖ్యమువహించియుండిరి. కాని శ్రీనారాయణమూర్తిగారు తమ తెలివితేటలవల్ల మదరాసు చేరిన కొన్నిరోజులకే గొప్పన్యాయవాదిగ పరిగణింపబడినందున సునాయాసముగ కొన్నివేలు హైకోర్టుఅపీళ్లవల్లనే సంపాదించుచుండిరి. ఇటీవల ఫెడరల్‌కోర్టుజడ్జీలైన శ్రీ పతంజలి శాస్త్రి గారు, హైకోర్టుజడ్జీలైన శ్రీ బి. సోమయ్యగారు వీరివద్ద జూనియర్లుగ కొంతకాలము పనిచేసిరి కావున శ్రీనారాయణమూర్తిగారి ప్రతిభనుగూర్చి వ్రాయుంట అనవసరము.

తమతరఫున ఫీజు ఎంత యివ్వవలెనని ప్రశ్నింపగా నవ్వుచు భాషా విషయమైనందున ఫీజులేకనే పిటీషను దాఖలుచేయుదు మనియు ఆమీద అన్నివిధముల సహాయపడుదు మనియు వీరు చెప్పిరి.

అంతేకాక శ్రీబాలగంగాధరతిలకుగారి జాతీయకక్షలో చేరుటకు మన రాష్ట్ర ప్రముఖులెందరో ఆలోచించుచుండ ధైర్యముగ ఈకక్షలో వీరుచేరి శ్రీ బిపిన్ చంద్రపాలుగారి బీచిసభకు అధ్యక్షతవహింప నితరు లెవ్వరు ముందుకు రానప్పుడు శ్రీ శాస్త్రిగారొకరై శ్రీ నారాయణమూర్తిగారు అధ్యక్షతవహించుటయేగాక శ్రీ పాలుగారికి టీపార్టీ కూడ నిచ్చి గౌరవించిరి.

‡శ్రీశాస్త్రిగారిసహాయమున తెనుగు ట్రాన్సులేటరు అయినట్టి వీరు ఈయభియోగమునకు కారకులు. వీరి రెండవభార్య శ్రీవావిళ్లవారిచే ప్రచురితమైన తారాశశాంకవిజయమును చదువుట వీరియాగ్రహమునకు కారణమట!

అవరకు తమపనిలోనే మగ్నులైయున్న వీరు శ్రీకనకరాజు ప్రభృతుల దయవల్ల పైకిలాగబడి శ్రీనారాయణమూర్తిగారివంటి ప్రముఖులపరిచయము సంపాదించుకొని ఆంధ్రమండలమున తదితర ప్రదేశముల ప్రసిద్ధులైరి.

రాధికాసాంత్వనమున అసభ్యము లన్న పద్యములు.

1 ఆ. 107, 108, 112, 113, 117, 124, 127, 128, 130, 146. 2 ఆ. 139, 140, 142. 3 ఆ. 105, 110, 113 115, 123, 127, 133. 4 ఆ. 102, 103, 104, 105.

## శ్రీ కనకరాజు ప్రభృతుల భాషాద్వేషము.

వీనికి శ్రీ కనకరాజుగారు తమ ఆంగ్లానువాదమును ప్రభుత్వమువారి కంద జేసి యీ ప్రబంధములు కడుదుష్టము లని వక్కాణించియుండిరి. తెనుగు అభిమానభాషగా పట్టభద్రులై దొరతనమువారికి అనువాదకులుగా బనిచేయు చుండిన శ్రీ కనకరాజుగారి కేమాత్రము ప్రాచీన ప్రబంధములపై గౌరవాభిమానము లున్నను వా రిట్టిపని చేసియుండకపోదురు. దూరాలోచనము లేని వారి యీచర్య తెనుగుభాషకును తెనుగుభాషాగ్రంథ ప్రకటన ప్రచారకులగు శ్రీ వావిళ్లవారికిని కొంతకాలముపాటు తీరనినష్టము కలిగించుట భాషాభిమాను లెవ్వరును మఱవజాలరు. వీరికితోడు శ్రీ టేకుమళ్ల రాజగోలరావుగారు, శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు, శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగార్లు ప్రాసిక్యూషనుపక్షమున సాక్ష్యమిచ్చి రనుట వీరికి ప్రాచీనగ్రంథములపైగల దురభిమాన ద్వేషములను జెప్పక చెప్పియున్నవి.

## మొదటి అభియోగముపై తీర్పు.

శ్రీ శాస్త్రులుగారిపై సాదరాభిమానములుగల బ్లాక్ బార్టను, శ్రీ టి. వేంకటసుబ్బయ్యరుగారు మొదట శ్రీ శాస్త్రిగారిపక్షమున వాదించిరి. ఈయభియోగమును తెనుగుభాష తెనుగు సారస్వతముల తత్త్వమును బాగుగా తెలిసిన మేజస్ట్రేటే విచారింపవలయు ననిరి. దీనిని ప్రధానరాష్ట్ర మేజస్ట్రేటు బర్డుదొర నిరాకరించినందున శ్రీ పేరి నారాయణమూర్తిగారి మూలమున హైకోర్టున ట్రాన్సుఫరు పిటీషను దాఖలు చేసిరి. ఇదికూడ త్రోసివేయ బడినతరువాత దొరతనమువా రీ క్రిందిఆర్డరు జారీచేసిరి.

ఈ కేసులో వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు తాము నిర్దోషుల మనియు, పై గ్రంథములు పునర్ముద్రణములే కాని నూతన ముద్రణములు కావనియు, ప్రాచీన కవిత్వగౌరవమే యీ గ్రంథ ప్రకటనకు హేతు వనియు "రాధికాసాంత్వనము" ప్రతులు తమదగ్గఱ నున్నవానిని నాశనము చేతు మనియు మిగిలిన గ్రంథములను సంస్కరించి ప్రకటింతు మనియు చెప్పియుండిరి. ప్రభుత్వమువా రిదివఱలో "రాధికాసాంత్వనము" ప్రతులను నాశనముచేయ నాజ్ఞాపించిరి. మిగిలిన గ్రంథముల విషయములో మదరాసు విశ్వవిద్యాలయ సిండికేటు మెంబరును, తెలుగు బోర్డు ఆఫ్ స్టడీస్ చేర్మను అగు శ్రీ జి. వేంకటరంగారావు ఎం ఏ గారి యధ్యక్షతను, రావు బహాదూర్ ప్రొఫసర్ శ్రీ యమ్. రంగాచార్యులు, శ్రీ గోటేటి కనకరాజుగార్లను సభ్యులుగా నియమించి పైగ్రంథములలోని అసభ్యపద్యములను జాపు దని యమించిరి.

పైసభ్యులు తమతమ యభిప్రాయప్రకార మట్లుచేసి కాగితములను దొరతనమువారి కందించిరి. ఇవి చూచినపిమ్మట శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారిపై నభియోగము నుపసంహరించుటకు శ్రీ శాస్త్రులుగారు శశాంక విజయము బిల్హణీయము గణికాగుణ ప్రవర్తన తారావళి అను గ్రంథములనుకూడ రాధికాసాంత్వనముతోపాటు మార్పుచేయవసినదనియు, మిగిలినయైదు గ్రంథములలోని అసభ్యపద్యములను తొలగించి సంస్కరించిన ముద్రణములే వేయవలె ననియు శాసించిరి. శ్రీ శాస్త్రులుగారు తే 5-8-1912 దీని అంతటిలో నూరకుండక తే 31-5-1913 దీన "రాధికాసాంత్వనము"కూడ సంస్కరించి ముద్రింపనిం డని కోరుకొనగా దొరతనమువారు నిరాకరించిరి.

## శ్రీ శాస్త్రులుగారిపై పునరభియోగము.

ప్రభుత్వముతో పోరాడి యెట్లైనను శృంగారగ్రంథములపై నిషేధమును తొలగింపజేయుటకే బద్ధకంకణులైన శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు

ప్రభుత్వముకోరిన హామీ యివ్వక వారు అశ్లీలము లని తలచిన పద్యములను తొలగించి సంస్కరించిన ఆయాగ్రంథములను అందరును మరలవిక్రయించుచునేయుండిరి. సుమారు 15 సంవత్సరములు అనగా 1912-వ సంవత్సర మండి 1927-వ సంవత్సరమువఱకు, దొరతనమువా రీగ్రంథప్రచారమును పూర్తిగ నరికట్టనే లేకపోయిరి.

తుదకు రహస్యపరిశోధకవర్గమువారి యాచూకీపై దొరతనమువారి సెర్చివారంటునుగొని తే 18-3-1927 దీని పోలీసు డిప్టీసూపరెంటు శ్రీకృష్ణస్వామినాయుడుగారు శ్రీశాస్త్రులుగారి గ్రంథవిక్రయశాలను, సి. ఐ. డి. పోలీసు ఇనస్పెక్టరు శ్రీసుదర్శననాయరు శ్రీశాస్త్రులుగారి ఆఫీసును, ముద్రాశాలను, సి. ఐ. డి. పోలీసు ఇనస్పెక్టరు శ్రీజయరామ్ నాయుడుగారు రాజమండ్రి వావిళ్లబ్రాంచిని తే 19-3-27 దీని పరిశోధించిరి. ఇందు చెప్పుపురిపాపులో :

| | | |
|---|---|---|
| 1. | శశాంకవిజయము | 8 |
| 2. | హంసవింశతి | 19 |
| 3. | బిల్హణీయము | 12 |
| 4. | కవిచౌడప్పశతకము | 64 |
| 5. | గణికాగుణప్రవర్తనతారావళి | 11 |
| 6. | వీథినాటకము | 9 |

పోలీసువారు తీసికొనిపోయిరి.

ఇవికాక శ్రీకాకుళవాసియగు శ్రీబల్లశంకరయ్యా, శ్రీపురిటి నరసింహమూర్తి పైగ్రంథములలో గొన్నిటిని శ్రీవావిళ్లవారినుండి వి. పి. మూలముగా తెప్పించుకొని రన్న సాక్ష్యములు సంపాదించిరి.

## శ్రీశాస్త్రులవారి నివేదిక.

ఈపరిస్థితులలో 1927-వ సంవత్సరము ఏప్రిలునెలలో శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు దొరతనమువారి న్యాయశాఖామంత్రియైన శ్రీ సి. పి. రామస్వామయ్యరుగారికి ఇట్లు నివేదించుకొనిరి.

1. నేను 1856-వ సంవత్సరమునుండి మాతండ్రిగారైన శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు ఆరంభించిన వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు అనుసంస్థ కధిపతిని. మాసంస్థయే పండితులైన మాతండ్రిగారి మూలమునను వారిమిత్రులగు పండితులమూలమునను మహోన్నతములు నపూర్వములగు మహాగ్రంథములను ప్రకటించి విఖ్యాతి నార్జించినది.

2. నేను గ్రంథప్రచురణ సందర్భములలో శశాంకవిజయము, బిల్హణీయము, హంసవింశతి, వీథినాటకము, గణికాగుణప్రవర్తనతారావళి, కవిచౌడప్పశతకము ముద్రించి ప్రకటించితిని.

3. ఇట్లుండగా తే 18-3-1927 దీని ఎస్ప్లనేడులోని నాషాపును, తండియారుపేటలోని నాయిల్లు, మాముద్రాలయమును శోధించి పోలీసువారు పైగ్రంథప్రతుల నన్నిటిని పట్టుకొనిపోయిరి.

4. పైజూపిన గ్రంథములన్నియు తెలుగుసారస్వతమున మిక్కిలి యున్నతస్థానము నాక్రమించిన సత్కావ్యములు. అందులో ముఖ్యముగా 1. వీథినాటకము, 2. హంసవింశతి, 3. శశాంకవిజయము, 4. బిల్హణీయము అనుకావ్యములు క్రీ. శ. ౧౭,౧౮ శతాబ్దములకు జెందిన మహాకవుల గ్రంథములు. అవి ప్రతియింటివారికి తెలిసినవి. ఇవి తెలుగుగ్రంథములలో చేరెన్నికగన్నవై శతాబ్దులనుండి పారంపర్యముగా పండితులచే బఠింపబడుచు వచ్చుచున్నవి. తెలుగువారి కీగ్రంథము లత్యంత ప్రియమైనవి. ఇట్టిశతాబ్దులకు పూర్వము రచింపబడినగ్రంథములను 292 సెక్షనుక్రింద తీసికొనిరాజాచుట

న్యాయదూరము. ఈపద్ధతి నవలంబించినచో ప్రతిభాషలోని గ్రంథముల లోను అనేకములు ఇట్టివే యని చెప్పుటకు సంశయము లేదు.

5. అందునను శ్రీనాథుని వీథినాటకము క్రీ. శ. ౧౫ శతాబ్దికిచెందిన ఉత్తమగ్రంథము. శ్రీనాథునికీడగు కవులు లేరనుట స్వభావోక్తి. వీథియను తెగకిందవచ్చు నుత్తమగ్రంథము భాషలో నిది యొక్కటియే. ఇది 1911, 1912 వఱకు నిరభ్యంతరముగ నెల్లరచేతుల నుండెడిది. అప్పుడు నాపైదొర తనమువారు తెచ్చిన యభియోగమువలన నం దెన్నియో సంస్కరణలు కొనివచ్చితిని కాని నిపుడు దీని కభ్యంతర ముండఁగాదు.

6. తరువాత హంసవింశతి, అయ్యలరాజ నారాయణకవిచే రచింపఁబడిన ౧౬ శతాబ్దినాటి కావ్యము. ఇందు అత్యంతకవితా సౌందర్యముగల యిరువది కథలు గలవు. ఇందు పదునారవశతాబ్దికి జెందిన జనుల పద్ధతులు నాచారములు సువ్యక్త మొనరింపఁబడినవి. ఇందు అపూర్వములైన యనేక సాంకేతికపదములు గలవు. ఇది సారస్వతమునకు భూషణము వంటిది. ఈగ్రంథమునే దొరతనము నిషేధించినచో సారస్వతమునకు తీరనిలోటు వాటిల్లినదన్న మాట. ఇదికూడ "వీథినాటకము"నకు వలెనే 292 సెక్షను క్రింద నెన్నటి కిని రాదు.

7. శశాంకవిజయము శేషము వేంకటపతి యను ౧౭ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ కవిచే రచితము. సారస్వతరంగమునను నాటకరంగమునను దీని విలువ నిరుపమానము. వివిధముగ నూహించినను ఇది నిషేధింపబడుట కవకాశము లేదు.

8. బిల్హణీయ మాపేరి సంస్కృతముగ్రంథమున కనువాదమై గత శతాబ్దమునుండి తెనుగుజనుల హస్తముల నలంకరించుచున్నది. ఆర్కాటు నవాబునకు దుబాసియైన దివాన్ బహదూర్ ఆదినారాయణయ్య మేనమామకు

అంకిత మీయఁబడినది. సారస్వతమున దీని విలువ యనంతము. ఇదియొక ప్రామాణికకావ్యము.

9. కవి చౌడప్పశతము, గణికాగుణప్రవర్తన తారావళియీరెండు గ్రంథములు నీతులనిధులుగ గత ౭౦, ౮౦ సంవత్సరములనుండి ప్రచారములో నున్నవి.

10. ఆధునికుల యభిరుచుల కసహ్యములుగ నుండునను సంశయమున వీనిని ప్రకటించునపుడే యందలి పదములుకొన్ని వైతొలఁగింపఁబడినవి. సంఘ సంస్కర్తలలో అతివాదులగు శ్రీకందుకూరి వీరేశలింగముపంటివారికిగాక రావు బహదూర్ యమ్. రంగాచార్యులవంటి వారి కిం దసభ్యములు కాని యశ్లీల ములుగాని కానరానేలేదు. అంతేకాక, నేటివారి యభిరుచులు వ్యతిరేకముగా నున్నమాత్రమున నందలి పదము లేవియు దొలగింప రాదనియుఁ దొలగిం చిన భావను పెద్దలోటే యనియు వక్కాణించియున్నారు.

11. వెనుక 1911 లో నాపై వచ్చిన యభియోగసందర్భమున అంధ్రసాహిత్యపరిషత్తు వారి ఆధ్వర్యమున జరిగిన పండితమహాజనసభలో నిట్టి నిషేధము దూరాలోచన లేనిదనియు దానివలన భాషామాతకు మహా ద్రోహము చేసిన ట్లగుననియు ఒక తీర్మానమును జేసిరి. అదిగాక సర్. బి. యన్. శర్మ, దివాన్ బహదూర్ మాచర్ల రామచంద్రరావు పంతులు మున్నగు వారీవిషయమున గవర్నరుగారిని దర్శించిరి. ఆ యభియోగసందర్భమున నాకు దొరతనమువారు కొన్నికొన్ని పద్యము లసభ్యములుగా నున్న వని సూచించి నావివేకము ననుసరించి సంస్కరించి ప్రకటింపవలసిన దని అపుడు నన్ను హెచ్చ రించిరి. ఇప్పటికిని నా కట్టి యుదారపూరితములైన సూచనల నేమైన నొసం గినచో నేనువానిని పాటించి గ్రంథములను ముద్రించి ప్రకటింతు నని వినయ పూర్వకముగా దెలుపుకొనుచున్నాను.

12. నేను ప్రకటించినయీపై గ్రంథములు చాలవఱకు సంస్కరించి నవే. కొన్ని పండితులకు మాత్రము ఆ సంస్కరింపబడిన ముద్రణ ప్రతులు

మాత్రము విక్రయించుచున్నాను; అందుచే బి 2- వసెక్షను క్రిందవచ్చు గ్రంథములు నేనేమియు ముద్రించి ప్రకటింపలేదని మనవి.

13. పైజూపినట్లు పైగ్రంథములు విఖ్యాతకవుల రచనలేకాని సామాన్యులవి కావనియు ఆయాగ్రంథములలో నసభ్యపు భాగములు వైతొలగించుటలో నేను చూపినశ్రద్ధ యితరప్రకాశకు లెవ్వరును జూపనే లేదనియుం దెలుగుదేశములో నైజాముసంస్థానములోను ఇతరులు స్వల్పధరలకు చచ్చుముద్రణములు నిర్నామముగా వేసినట్లు నేను చేసినవాడను గాననియుం మనవి చేయుచున్నాను.

14. మఱియుం ఫలానా పద్యముకాని నిర్దిష్టమైన యొకగద్యముకాని అసభ్యము అశ్లీల ద్యోతకము ననుట కెట్టి యాధారములు లేనియెడలను, కొందఱిప్రకాశకులపై మాని కొందఱు ప్రకాశకులపైనే యిట్టి అక్రమచర్య అతిత్వరగా గైకొన్నప్పుడును, నావంటివాని ప్రసిద్ధము ధర్మబద్ధమునగు సంస్థ కెట్టి నీలాపనిందలు కలుగునో దానివలన నా కెట్టినష్టము వాటిలునో ఆనష్టమెంత తీర్పరానిదో అనూహ్యముగనున్నది. కొమ్ములు తిరిగిన పండితులే యేది సభ్యము, ఏది యసభ్యము నన్నది నిర్ణయించి నిర్వచింపలేనప్పుడు నావంటివారిపై నిట్టియక్రమచర్య గైకొనుట ధర్మము కాదని మనవి చేయుచున్నాను. నావంటివారికి మార్గము చూపుటకై యేభాగము లశ్లీలద్యోతకములో యే భాగములు కావో నిర్ణయించుటకు దొరతనము వారే నియమింతు రని యాశించుచున్నాను. ఈపరిస్థితులలో నాపై నిక నెట్టిచర్యను గైకొనకుండునట్లును, నాకడ సంగ్రహించిన గ్రంథములన్నిటిని నా కిచ్చివేయుటకును దొరతనమువారిని ప్రార్థించుచున్నాను.

విధేయుడు,

వావిళ్ల వేంకటేశ్వరులు,

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సు,

తండయార్పేట, మదరాసు.

21-3-1927.

ఈనివేదిక కనుబంధముగా బంపిన నివేదికలతోపాటు ఈక్రింది యభి ప్రాయములుకూడ జతపఱచి పంపబడినవి;

1. 1911 వ సంవత్సరములో శ్రీ శాస్త్రులుగారిపై దీసికొనిరాబడిన క్రిమినలు అభియోగమునకు విషయములైనగ్రంథములగు 1. వీధినాటకము, 2. హంసవింశతి, 3. శశాంకవిజయము, 4. బిల్హణీయములు పరిష్కృత ముద్రణములనియు నేను జాగ్రత్తగా జూచి యిందు వివిధమైన యాక్షేపణము గల యేభాగముకూడ లేదని ధృవపఱచుచున్నాను.

ఇట్లు,
జి. వెంకటరంగారావు, ఎం. ఏ.

2. పైని శ్రీరంగరావుగారు సూచించిన గ్రంథములు ప్రామాణికులైన ప్రాచీనకవులచే రచితములైన సత్కావ్యములు. వానిలో నటనట నసభ్యవర్ణనలు గల వని వానిని నిషేధించుట అన్యాయమేకాక ఆంధ్రభాషకు తీరని యపకారము చేయుటని నాభావము. ఈగ్రంథముల ప్రస్తుత ముద్రణములు పరిష్కృతముద్రణములు. ఇందేవిధమైన యాక్షేపణలుగల భాగములును లేవు. ఇట్టి సద్గ్రంథ ప్రకటనము మూలమున అశేషాంధ్రజనులకు గౌరవపాత్రులైన ప్రకాశకులపై నభియోగము తెచ్చుటయు, నందుమూలమున నిట్టిగ్రంథ ప్రకటనము నరికట్టుటయు నత్యంతము గర్హ్యములు.

వేమవరపు రామదాసుపంతులు,
ఆంధ్రగ్రంథనిర్ణాయకసంఘాధ్యక్షులు,
మదరాసు విశ్వవిద్యాలయమున
సెనేటు, అకడమిక్ కౌన్సిలు సభ్యులు.

3. ఇట్లే పేర్కొనబడిన దివాన్ బహదూర్ శ్రీయస్. కృష్ణస్వామి అయ్యంగారిలేఖ.

4. శ్రీ పి. సుబ్రహ్మణ్య అయ్యరు బి. ఏ. యల్. టి. గారిలేఖ.

5. శ్రీ యన్. రామానూజం చెట్టి, ఎం. ఏ., బి. యల్. గారి లేఖ.

6. శ్రీ జయంతి రామయ్య బి. ఏ బి. యల్. గారి లేఖ.

7. శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు ఎం. ఏ. బి. యల్. గారి లేఖ.

8 శ్రీ గిడుగు వేంకట సీతాపతి గారి లేఖ.

9. శ్రీ రావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తి గారి లేఖ.

10. శ్రీ. న్యాపతి సుబ్బారావు పంతులు గారి లేఖ.

దీని ఫలితాంశము.

ఈ పైలేఖలు కూడ న్యాయశాఖా మంత్రిగారికి శ్రీ శాస్త్రులుగారు పంపిరి. ఆపిమ్మట శ్రీ శాస్త్రులుగారు సంస్కరించి ప్రకటించిన హంసవింశతి (1920 సంవత్సర ముద్రణము) బిల్హణీయము (1926 సంవత్సరముద్రణము) వైజయంతీవిలాసము (1909 సంవత్సరముద్రణము) అను గ్రంథముల ప్రతులు దొరతనము వారి కంపిరి. అప్పుడు దొరతనమువారు 25-4-27 తేదీని ఈ క్రిందిలేఖ శ్రీ శాస్త్రులు గారికి పంపిరి. అందలిభావము పైగ్రంథములలో హంసవింశతి సరిగానే యున్నదనియు ఆగ్రంథప్రతులను ప్రజలకు విక్రయింపవచ్చు ననియు తెలిపి బిల్హణీయములోని ద్వితీయాశ్వాసమందలి 152వ పద్యమందలి 7 వపంక్తియు, తృతీయాశ్వాసమందలి 103వ పద్యమున 3వపాదమును అశ్లీలములుగా నున్నవనియు వైజయంతీవిలాసమున మూడవయాశ్వాస మందలి యేడవపద్యమును అసభ్యములుగా నున్నవనియు ఆభాగములను వైతొలగించి ప్రకటించుకొనవచ్చు ననియు తెలిపిరి.

దొరతనమువారి తాఖీదు.

ఏమైనను చెన్నపురిప్రభుత్వనుమాత్రమూరకొనక 8-8-1927 తేదీని శ్రీ శాస్త్రులు ఆయాగ్రంథములను విక్రయించుచున్నందులకు ఏల శిక్షార్హుని చేయరాదో తెలుపుకొనఁగోరుచు తాఖీదుపంపిరి. అప్పుడు శ్రీ శాస్త్రులుగారు

తే 18-8-1927 దీని మరల వెనుకటివిషయము లన్నిటిని దెలుపుచు నొక పిటీషను పంపి అందింకను ఈవిషయముల నివేదించిరి.

## శ్రీ శాస్త్రి గారి సమాధానము

“నేను పరిష్కరింపని ముద్రణములు కేవలము పండితులకొఱకు భాండాగారముల కొఱకు ఉద్దేశింపఁబడినవి. అందుకొఱకే వాని వెలలుకూడ అధికముగా నుంచితిని.

ఎంత శ్రద్ధవహించినను అనేక సంస్థలలో నేను గౌరవవ్యవహర్తనుగా నుండు చుండుటచే ప్రమాదవశమున కొన్ని విక్రయింపబడియుండవచ్చును. అది నే నుద్దేశపూర్వకముగా ప్రభుత్వమును నిరసించుటకు చేసినపని మాత్రము కాదని మనవి చేయుచున్నాను.

నేను చెన్నపురిలో కొంతకాలము గౌరవమేజస్ట్రేటును; తిరుపతి యూనియనులోని మొదటితరగతి బెంచికోర్టునకు నన్ను అధ్యక్షునిగా ప్రభుత్వమే నియమించిరి. చెన్నపురి పోర్టుట్రస్టులోను, పచ్చయప్పట్రస్టుబోర్డులోను నేను ప్రధానసభ్యుడను. ఇదిగాక ఎన్నో వర్తకవాణిజ్య ధార్మికసంస్థలతో నాకు సన్నిహితసంబంధము కలదు. అట్టివాడను నేను బుద్ధిపూర్వకముగా నిట్టిపనిని జేసితి ననుకొనుట ప్రభుత్వమునకు ధర్మము కాదు. పొరపాటువలన నట్టి గ్రంథము లిదివఱలో విక్రయింపబడినను, ఇకముం దట్టిపని జరుగకుండ జూచెదను. కావున ప్రభుత్వమువారు నాపై చేచర్యను గైకొనక నన్నెట్లు ప్రవర్తింపు మన్ననట్లు ప్రవర్తించెద నని తెలుపుకొనుచున్నాను.”

ఇట్లు
వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు.

## తదనంతర చర్య.

ఆతరువాత శ్రీశాస్త్రులుగారు తే 30-8-1927 ది ప్రభుత్వప్రధాన న్యాయశాఖామంత్రిని గలిసికొని హంసవింశతి, బిల్హణీయము, శశాంకవిజయము, గణికాగుణప్రవర్తన తారావళి అను గ్రంథములను యథాతథముగా పండితులకు మాత్రమే విక్రయించెదమనియు, దాని విషయమున దీసికొనవలసిన శ్రద్ధతీసికొనియెద మనియు దాని కనుమతింప వలసినదనియు గోరిరి.

దీనికేమియు ప్రభుత్వమునుండి సమాధానము రాలేదు. ఇట్లుండగా తే 20-1-28 దిని శ్రీశాస్త్రులుగారు నిషేధింపబడిన గ్రంథము లమ్మినందులకు తేబడిన అభియోగమునకు సమాధానము చెప్పుకొనుటకు తే 6-2-1928 ది చెన్నపురి ప్రధాన మేజిస్ట్రేటుకోర్టునకు హాజరు కావలసినదని తాఖీదు వచ్చెను.

దానిమీదట శ్రీశాస్త్రులుగారు తే 31-1-1928 దీ ప్రభుత్వప్రధాన కార్యదర్శిపేర పైవిషయముల నన్నిటి నుల్లేఖించుచు లేఖవ్రాసి యందు తాము బుద్ధిపూర్వకముగా చేయని నేరమునకు రచ్చకెక్కించుట ప్రభుత్వమునకు ధర్మము కా దనియు నిదివరలో బ్రకటితమైన గ్రంథములను తే 18-3-1927 ది పోలీసువారు స్వాధీనముచేసికొని పట్టుకొనిపోయిరి గనుక, నిక దమపై నెట్టిచర్యయు గైకొనవల దని విన్నవించిరి.

## నాటి దొరతనమువారి తుది తీర్పు

అప్పుడు తే 16-2-1928 దీని ప్రభుత్వమువారీ క్రింది సమాధానమును శ్రీశాస్త్రులుగారికి పంపిరి.

"మీరు తే 5-8-1921 ది ప్రభుత్వమువారికిచ్చిన *హామీకి విరుద్ధముగా ప్రకటించిన గ్రంథములన్నియు పోలీసువారికి వశపఱిచి, ఇక మరల

* ఈహామీ వీ రెన్నడును ఈయలేదు.

నెన్నడు పరిష్కృత ముద్రణములుగాగాని అపరిష్కృత ముద్రణములుగాగాని వానిని ముద్రింప మని మరల వారిమీ యిచ్చినచో మీపైనున్న యభియోగమును ఉపసంహరించుకొనుచున్నాము."

ఎ. వై. జి. క్యాంబెల్,
ప్రభుత్వప్రధాన కార్యదర్శి.

కాని, అప్పటినుండియు శ్రీశాస్త్రులవారు దొరతనమువారియానిషేధమును దొలగింపజేయ విశ్వప్రయత్నములు చేయుచునే యుండిరి. అవివేకమగల ప్రభుత్వమువలనను అసూయాగ్రస్తులై యనాలోచితముగ దొరతనమువారి పక్షము చేరి వారు ప్రేరేపించిన కొంతమంది మనవ్యక్తుల వలనను ఈనిషేధమును దీనివలన తెనుగు సారస్వతమునకు తీరనికొఱతయును వాటిల్లెను. నాటినుండి యథాతథముగ నున్న పైగ్రంథము లేవియు నెవ్వరికిని లభ్యము కాకుండపోయెను. శ్రీశాస్త్రులుగారికి వ్యవహారమున గలిగిన నష్టమును దైహికముగా గలిగిన శ్రమయును అనంతములే కాని, వారి కవి యొక లెక్కలోనివి కావు. ఉత్తమమగు తెనుగుసారస్వతమందలి కవితా మహాత్వమును జాటు నపూర్వగ్రంథము లిట్లు నిషేధింప బడుటవలన ఆంధ్ర సాహిత్య వృక్షమున కొక పెద్దగొడ్డలిపెట్టని శ్రీశాస్త్రులుగారు పొందిన మానసికవ్యథ యింతంత కాదు. నిష్కల్మషముగను, నిష్కామముగను భాషామాత నారాధించు పవిత్రహృదయులు కనుకనే వీరి కింత బాధ కలిగినదని చెప్పనగును.

ఉపసంహారము.

సుమారొకయర్ధశతాబ్దము శ్రీశాస్త్రులుగారు కేవలభాషాభిమానముతో విశేషవ్యయప్రయాసల కేమాత్రమును సరకుగొనక యీప్రభుత్వనిషేధమును తొలగింప దొరతనమువారితో హోరాహోరి పోరాడి రనుట ఆంధ్రసారస్వత చరిత్రమునను శ్రీశాస్త్రులవారి జీవితమునను సువర్ణాక్షరములతో లిఖింపవలసిన విషయము. వీరిట్లు పట్టుదలతో పోరాడుచు శ్రీమాక్ చక్రవర్తి